# కాల్షియమ్ వల్ల టినా యొక్క సాహసాలు. "వాస్తవమైన సామర్థ్యం"




























మిత్రులారా, 200 గ్రా.ల పార్లే ప్రూడెంట్ కాల్షియమ్** ప్యాక్ యొక్క ఫ్లాప్‌ను (పళ్ళు) (డ్రాయింగ్‌గల ప్రక్క) మీ పేరు, మీ జన్మదినం, మీరు చదువుకొనే స్కూలు మరియు క్లాసు వివరాలకు జతపర్చి, ఈ అడ్రసుకు వెంటనే పంపండి : పార్లే (ప్రొడక్ట్స్) లి., నిర్లాన్ హౌస్, వర్లి, బొంబాయి 400 025.

IB&W/94/222

# BAND-AID®

## Funtest

ప్రతి బ్యాండ్-ఎయిడ్ ఫన్‌టెస్ట్ ప్యాక్‌తో రెండు ఫన్‌స్టిక్స్* ఉచితం




## మీ ఫన్‌స్టిక్స్*ని పోగుచేయడం మొదలెట్టండి ఇప్పుడే!

*సువాసనగల ప్లాస్టిక్ క్రేయాన్స్

**నియమాలు, నిబంధనలు**

1. ఈ పోటీలో 4 నుంచి 15 సంవత్సరాల మధ్య వయసులోని పిల్లలు పాల్గొనేందుకు అర్హత వుంది. కేవలం భారతీయ పౌరులే దీన్లో పాల్గొనే అర్హత వుంది.
2. జాన్సన్ అండ్ జాన్సన్ మరియు ఒగిల్వీ మేథర్ సంస్థలలో పనిచేసే ఉద్యోగులూ, వారి బంధువులూ దీనికి పాల్గొనే అర్హతలేదని సాదరమైన సూచన.
3. ఒక వ్యక్తి ఎన్ని ఎంట్రీలైనా పంపవచ్చును.
4. ప్రతి ఎంట్రీ పూర్తిగా వుండాలి. అసంపూర్తి అయినవీ, లేదా అర్హతలేని ఎంట్రీలూ రద్దుచేయబడ్డవాటిగా పరిగణిస్తాం.
5. ఎంట్రీలు పంపవలసిన ఆఖరు తేదీ, 28 ఫిబ్రవరి, 1995. అయితే యీ ఆఖరి గడువు తేదీని పొడిగించే లేదా మార్చే హక్కు, కంపెనీ వారికి చెందుతుంది.



# చందమామ

డిసెంబర్ 1994



ఈ సంచికలో కథలు-వింతలు-విశేషాలు


| | | | |
|---|---|---|---|
| వార్తలు - విశేషాలు | ...9 | వెనుకబడినశిష్యుడు | ....37 |
| మరుగుజ్జురాక్షసి | ....11 | యోగ్యతాపరీక్ష | ....42 |
| భువనసుందరి-3 | ....17 | మహాభారతం-7 | ....45 |
| చందమామ కబుర్లు | ....24 | పారినపథకం | ....53 |
| శత్రువు--శత్రుత్వం (బే.క) | ....25 | అహంకారం | ....59 |
| రాళ్ళగుట్టమీద లాంతరు | ....32 | ప్రకృతి వింతలు | ....63 |
| చందమామ అనుబంధం - 74 | ....33 | ఫోటో వ్యాఖ్యల పోటీ | ....65 |





విడి ప్రతి : 5.00

సంవత్సర చందా : 60.00




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'　　సంచాలకుడు : నాగిరెడ్డి

## బాల కార్మికుల సమస్య!

ఎప్పటిలాగే ఈయేడూ దీపావళి వచ్చింది; వెళ్ళింది. వరదలు, ప్రకృతి వైపరీత్యాలు, రోగాలు, ప్రమాదాలు చుట్టుముట్టినప్పటికీ బాణాసంచాతో సహా దీపావళి పండుగ జరుపుకోవడం మాత్రం మనకు తప్పలేదు!

అయితే, బాణాసంచా పేల్చుతున్నప్పుడు వాటిని తయారు చేసే ప్రమాదకరమైన పరిశ్రమలో సగానికిపైగా పదిహేనేళ్ళు నిండని బాలబాలికలే పనిచేస్తున్నారన్న విషయం ఎంతమంది పట్టించుకుంటున్నాం? బాణాసంచా పరిశ్రమలోనే కాదు. అగ్గిపెట్టెలు, బీడీలు, తివాసీలు మొదలైన చాలా పరిశ్రమలలో బాలకార్మికులే ఎక్కువగా పనిచేస్తున్నారు. చదువుకోవలసిన పసిప్రాయంలో వాళ్ళ బతుకులిలా వాడిపోవడం చూసి పలువురు వాపోతున్నారు; విమర్శిస్తున్నారు. ఈ విషాదకరమైన పరిస్థితిని అంతం చేయాలని అధికారులకు విజ్ఞప్తులు చేస్తున్నారు.

ఈ బాలకార్మికుల సమస్య, తల్లిదండ్రుల పేదరికం వల్ల ఏర్పడుతున్నది. ఆర్థిక నిర్బంధం వల్ల కలుగుతున్న సాంఘిక రుగ్మత ఇది. ఆకలికి అలమటించకుండా వుండాలంటే కన్నవాళ్ళతో పాటు పిల్లలు కూడా కాయకష్టం చేయవలసిన ఆర్థిక దుస్థితి ఆ కుటుంబాలను పట్టి పీడిస్తున్నది. అందువల్ల వారిని విమర్శించి ప్రయోజనం లేదు. తల్లిదండ్రులకు సరైన జీవనోపాధి కల్పించాలి. మరి అలా కల్పించగల పుణ్యాత్ములెవరు?

సంపుటి : 96　　డిసెంబర్ '94　　సంచిక: 6

విడిప్రతి : 5.00　　సంవత్సర చందా : 60.00

వార్తలు – విశేషాలు :

# శ్రీలంకలో సరికొత్త రికార్డులు!

శ్రీలంక ప్రధానమంత్రిగా శ్రీమతి చంద్రికా కుమారతుంగా ఆగష్టు 19వ తేదీ పదవీ బాధ్యతలుస్వీకరించినప్పుడే ఆమె ఇద్దరు మాజీ ప్రధాన మంత్రుల కుమార్తె అన్న చరిత్రను సృష్టించడం జరిగింది. ఆమె వయసు 49 సంవత్సరాలు.

ఆమె తండ్రి ఎస్.డబ్ల్యు.ఆర్.డి. బండారనాయకే 1956వసం॥ నుంచి 1959వసం॥లో హతుడయ్యేంతవరకు ప్రధానిగా ఉన్నాడు. ఆయన మరణానంతరం ఆయన సతీమణి శ్రీమతి సిరిమావో బండారనాయకేను ఆ దేశం, ప్రధానమంత్రిని చేసింది. అప్పుడామె ప్రపంచంలో మొట్టమొదటి మహిళా ప్రధానమంత్రి అన్న కీర్తి నార్జించింది. ఆమె 1960 నుంచి 1965 వరకూ, ఆ తరవాత 1970 నుంచి 1977 వరకూ రెండుసార్లు అధికారంలో ఉన్నది.

ఇప్పుడు శ్రీమతి చంద్రికా కుమారతుంగా ప్రధాని అయిన మూడు నెలలలోగా అంటే నవంబర్ 9వ తేదీ అధ్యక్ష పదవికి ఎన్నికలు జరిగాయి. ఆ ఎన్నికలలో శ్రీమతి కుమారతుంగా పాలక పక్షమైన పీపుల్స్ అలయెన్స్ పార్టీ తరఫున అధ్యక్ష పదవికి పోటీ చేసి 62 శాతం ఓట్లకు పైగా ఓట్లు పొంది విజయం సాధించింది. నవంబర్ 12వ తేదీ ఆమె అధ్యక్ష పదవి ప్రమాణస్వీకారం చేసింది. ఇప్పుడు శ్రీలంకలో అధ్యక్ష పదవిని చేపట్టిన మొట్టమొదటి మహిళ శ్రీమతి కుమారతుంగా!



శ్రీమతి కుమారతుంగా అధ్యక్షపదవి చేపట్టాక, ఏ శాఖనూ నిర్వహించని మంత్రిగా తన 22 మంది మంత్రి మండలిలో చోటు చేసుకున్న తనతల్లి సిరిమావోబండారనాయకేను ప్రధానమంత్రిని చేసింది.దాంతో శ్రీమతి సిరిమావో మూడవసారి దేశ ప్రధానమంత్రి అయింది! నవంబర్ 14వ తేదీ ఆమెతో పాటు, కొద్ది మార్పులతో 21 మంది మంత్రులు

పదవీ ప్రమాణం చేశారు.



శ్రీలంక ఫ్రీడమ్ పార్టీ స్థాపకుడూ, అధినేతా అయిన బండారనాయకే 1959వ సం॥లో హఠాత్తుగా హతుడైనప్పుడు ఆయన భార్య శ్రీమతి బండారనాయకే ఆ పదవిని చేపట్టడంలో ఆశ్చర్యం లేదు. 35 ఏళ్ళుగా కొనసాగుతూన్న ఆమె రాజకీయ జీవితం అప్పుడే ఆరంభమయింది. 1960వ సం॥లో జరిగిన ఎన్నికలలో ఆమె పార్టీ ఘనవిజయం సాధించింది. ఆమె దేశప్రధాని అయింది. 1970 వ సం॥లో ఆమె వామ పక్షాల మద్దతుతో అధికారాన్నిచేపట్టి1977వరకు నిలుపుకున్నది. 1977వ సం॥లో జరిగిన ఎన్నికలలో ప్రధాన ప్రతిపక్షమైన యునైటెడ్ నేషనల్ పార్టీ విజయం సాధించడంతో దాని నాయకుడు జయవర్ధనే నూతన రాజ్యాంగం ప్రకారం ఎక్కువ అధికారంతో దేశ అధ్యక్షుడయ్యాడు.

1989వ సం॥లోనూ యునైటెడ్ నేషనల్ పార్టీయే గెలుపొందింది. అంతవరకు ప్రధానిగావున్న ప్రేమదాస అధ్యక్షుడయ్యాడు.1993వ సం॥లో ఆయన హతుడవడంతో అప్పటి ప్రధాని విజెతుంగా అధ్యక్షుడయ్యాడు. ఇప్పుడు శ్రీమతి కుమారతుంగా నాలగవ అధ్యక్షురాలయింది!

1993వ సం॥లో ఎస్.ఎల్.ఎఫ్.పి. మరికొన్ని పార్టీలతో కలిసి పీపుల్స్ అలయెన్స్‌ను ఏర్పాటు చేసింది. ఆ పార్టీ శ్రీమతి కుమారతుంగాను నాయకురాలుగా ఎన్నుకున్నది. ఆ సంవత్సరం జరిగిన ప్రాంతీయ ఎన్నికలలో అధిక జనాభాగల పశ్చిమ ప్రాంతంలో పోటీ చేసిన కుమారతుంగా గెలుపొంది మొట్టమొదటి మహిళాముఖ్యమంత్రి అయింది.

శ్రీమతి చంద్రికా కుమారతుంగా అధ్యక్ష పదవిని చేపట్టాక, త్వరలో రాజ్యాంగంలో మార్పులు తీసుకువచ్చి, అధ్యక్షపాలనావిధానానికి స్వస్తి చెప్పి, మళ్ళీ పార్లమెంటరీ విధానాన్ని అమలు చేయాలన్న తన పార్టీ నిర్ణయాన్ని ప్రకటించింది. జూలైలోగా ఈ మార్పులు జరగవచ్చునీ, అప్పుడు శ్రీమతి కుమారతుంగా సంపూర్ణ అధికారం గల ప్రధానమంత్రి కాగలదనీ,78సంవత్సరాలు నిండిన ఆమెతల్లి శ్రీమతిబండారనాయకే అధ్యక్షురాలు కాగలదనీ పరిశీలకులు భావిస్తున్నారు. ఆరేడు నెలలలో తల్లీ కూతుళ్ళ పదవులు మారగలవని ఊహిస్తున్నారు. అలా జరిగినట్టయితే అది శ్రీలంక సృష్టించబోయే మరొక రికార్డు అవుతుంది!



# మరుగుజ్జు రాక్షసి

రామాపురంలోవుండే శకుంతల, తల్లీ తండ్రీ లేని పిల్ల. ఆమె సవతితల్లి, ఆమెను అన్ని విధాలా రాచిరంపాన పెడుతూండేది. శకుంతలది కళ్ళు జిగేల్‌మనిపించే అందం. ఆమె సవతి చెల్లెళ్ళిద్దరూ బొత్తిగా అనాకారులు.

"ఈ అరిష్టపు పీనుగ పుణ్యాన నా పిల్లలకు పెళ్ళయ్యే గీత వున్నట్టు లేదు!" అంటూ సవతితల్లి శకుంతలను రోజుకొకసారయినా తిడుతూండేది.

ఇలా వుండగా — శకుంతల సవతితల్లి, తన మేనమామతో మంతనాలాడి శకుంతలనుగ్రామంలోని ధనికుడైన ముసలి ముకుందానికి కట్టపెట్టాలని పథకం వేసింది. ఈ సంగతి తెలుసుకున్న శకుంతల, ఒకనాటి చీకటిపడే వేళ, అడవి పక్కన వున్న చింతల తోపుకు వెళ్ళింది.

ఆ తోపులో ఒక ముసలిది వుంటున్నది. అడవిలో ఎండు పుల్లలు ఏరుకురావడానికి వెళ్ళేటప్పుడు శకుంతల, ఆ ముసలిదాన్ని చూస్తూండేది. అది ఒక మంత్రగత్తె అని అందరూ చెప్పుకునేవాళ్ళు. దానివి పిల్లికళ్ళు. నుదుట పెద్ద కుంకుమ బొట్టుతో, రాగి రంగు జుట్టువిరబోసుకుని భయంకొలిపేలావుండేది.

ముసలిది, శకుంతలను చూస్తూనే, "నువ్వు అడవిలో ఎండుపుల్లలు ఏరుతూండగా చాలా సార్లు చూశాను. చీకటి పడి ఇలా వచ్చావేం?" అని అడిగింది.

శకుంతల, ముసలిదానికి తనకు రానున్న విపత్తు గురించి చెప్పుకున్నది. ముసలిది ఆమెను మరిన్ని వివరాలడిగి తెలుసుకుని, "ఏ లెక్కన చూసినా సవతితల్లికి, నీ మీద అధికారం చెలాయించే హక్కు లేదు. మా అక్క మంత్రాల మరిడమ్మ చచ్చిపోయే దాకా, ఇద్దరం ఈ గుడిసెలోనే వుండే వాళ్ళం. పదేళ్ళుగా ఒంటరి బతుకునాది.నీకు తగిన భర్త దొరికే దాకా ఇక్కడే వుండిపో. నీ సవతితల్లి

మాచిరాజు కామేశ్వరరావు



ఇటు వచ్చి ఏమైనా గొడవ చేసిందో, నిలువునా బూడిద చేసేస్తాను," అన్నది కోపంతో.

ఆనాటి నుంచీ ముసలిది, శకుంతలను ఎంతో ఆప్యాయంగా చూసుకునేది. ఇంటి పనంతా శకుంతల చేస్తూండడంతో, దానికి ప్రాణం హాయిగా వున్నది.

ముసలి మంత్రగత్తెకు ఒక ఒంటెద్దు బండి వున్నది. అది ప్రతి నెలా అడవిలో దొరికిన చింతపండు రెండు గోతాములనిండుగా బండి లోవేసుకుని, రాజధాని నగరంలో జరిగే సంతలో దాన్ని అమ్మి, తనకు కావలసిన నెలసరి సరుకులు తెచ్చుకుంటూండేది. ముసలిది ఈసారి సంతకు వెళ్ళే పని శకుంతలకు అప్ప చెప్పింది.

శకుంతల రాజధాని సంతకు బయలు దేరి, అడవి మార్గాన వెళుతూండగా, ఒక గుబురుచెట్టు మీది నుంచి మరుగుజ్జు బ్రహ్మరాక్షసి ఒకటి బండి ముందు దూకి, "ఆహాఁ, ఎంత అందమైన పిల్లవు. దేవతా కన్యలా వున్నావు!" అన్నది చప్పట్లు చరుస్తూ.

అది భయంకరంగా వున్నా మరుగుజ్జు కావడంతో శకుంతల ధైర్యం తెచ్చుకుని, "రాజధాని సంతలో చింతపండు అమ్ముకు రావడానికి వెళుతున్నాను. బండికి అడ్డంలే," అన్నది విసుగ్గా.

దీనికి మరుగుజ్జురాక్షసి ముఖం చిన్న బుచ్చుకుని, "అమ్మా, తల్లీ! నన్ను కూడా సంతకు తీసుకుపో. పొట్టిదాన్ని కావడంతో రాక్షసులు నన్ను గేలిచేస్తున్నారు. అందుకే ఇక్కడ చెట్టుమీద ఒంటరి బతుకు బతుకుతున్నాను. ఈ బతుకు విసుగ్గా వున్నది," అన్నది.

శకుంతల జాలిపడి, "సరే. నిన్ను గోతాంలో పెట్టి దాని మూతి బిగిస్తాను. గాలి పీల్చుకునేందుకూ, మాట్లాడేందుకూ నీ ముక్కు దగ్గరా, నోటి దగ్గరా గోతాంలో చిల్లులు చేస్తాను. సరేనా, రాక్షసీ?" అన్నది.

"రాక్షసీ! అదేం పిలుపు? నా పేరు యువరాణి. గోతాంలో చేసే చిల్లులేవో కళ్ళ దగ్గరా చెయ్యి. నాకు మనుషుల్ని చూసి ఆనందించాలని వున్నది." అన్నది మరుగుజ్జు రాక్షసి.

శకుంతల సంత చేరాక, రెండు గోతాముల చింతపండుతో పాటు రాక్షసి వున్న గోతామును

కూడా పక్కన పెట్టుకుని, "గోతాం చింతపండు యాభై రూపాయలు!" అంటూ కేకలు వెయ్యసాగింది. ఇంతలో దూరంగా పీచు మిఠాయి వాడి కేకలు వినిపించి మరుగుజ్జు రాక్షసి, శకుంతలతో, "అమ్మా, శకుంతలమ్మా! ఏమిటా పీచు మిఠాయి? కాస్త కొని తెచ్చి రుచి చూపించు," అన్నది మెల్లగా.

పక్కనే బెల్లం అచ్చులు అమ్ముతున్న కుర్రవాడికి, తన చింతపండు గోతాములు చూస్తూండమని చెప్పి శకుంతల, పీచు మిఠాయి కొని తేవడానికి వెళ్ళింది.

ఇంతలో పీచుమిఠాయి వాడు సంతలో చాలా దూరం వెళ్ళిపోయాడు. శకుంతల వాణ్ణి వెతికి పట్టుకుని, మిఠాయి కొని అర గంట తర్వాత తిరిగి వచ్చేసరికి బండిలో గోతాములు లేవు.

శకుంతల కంగారు పడిపోతూ చుట్టూ చూసేంతలో, బెల్లంఅచ్చులు అమ్ముతున్న కుర్రవాడు, ఆమె చేతిలో నూట యాభై రూపాయలు పెడుతూ, "పెద్ద శ్రమ లేకుండానే నీ చింతపండు అమ్ముడయిపోయింది. రాజభటులు వచ్చి మూడు గోతాముల చింతపండూ ఎత్తుకుపోయారు, తెల్లవారితే రాకుమారి పెళ్ళి కదా!" అన్నాడు.

ఇది విన్న శకుంతలకు ముచ్చెమటలు పోశాయి. తనను నమ్మి వచ్చిన మరుగుజ్జు రాక్షసిని రాజభటుల ఈటెలతో పొడిచి చంపడమో లేక గోతాంతోపాటు సజీవంగా మంటలలో వేసి కాల్చడమో చేస్తారన్న భయం పట్టుకున్నదామెకు.



శకుంతల క్షణం ఆలస్యం చేయకుండా రాజ ప్రాసాదం చేరుకున్నది. అక్కడ కొందరు ఆడామగా నౌకర్లు కూరగాయలూ, ఇతర సరుకులనూ మూటలలో ఎత్తుకుని, రాజప్రాసాదానికి వెనక ఉద్యానానికి పక్కగా వున్న ఒక చావడిలో దించుతున్నారు. శకుంతల కూడా ఒకమూట ఎత్తుకుని వాళ్ళతో కలిసి చావడిలోకి వెళ్ళింది. అక్కడ ఒక మూలగా తను తెచ్చిన చింతపండు గోతాములు కనిపించినై.

ఆమె మూటను ఒక చోట దించి; దాపుల ఎవరూ లేకుండా చూసి మెల్లగా, "యువరాణీ! యువరాణీ!" అని చిన్నగా పిలిచింది.



"పీచుమిఠాయి తెచ్చావా?" అన్నది ఒక గోతాంలోంచి రాక్షసి.

రాక్షసి క్షేమంగా వున్నందుకు శకుంతల తేలిగ్గా నిట్టూర్చి, "యువరాణీ! అనుకోకుండా ఇద్దరం పెద్ద ప్రమాదంలో చిక్కుకున్నాం. మనంఇప్పుడున్నదిరాజప్రాసాదపుఆవరణలో. నేను ఉద్యానంలోంచి చీకటి పడ్డాక పారిపోయేందుకు దారి చూస్తాను. ఈ లోపల నిన్ను పేరుపెట్టి పిలిచేదాకా గోతాంలోనే కుక్కిన పేనులా వుండు. బతికి బయటపడితే, అప్పుడు పీచుమిఠాయి సంగతి చూద్దాం," అని గోతాం ముడివిప్పేసి, అక్కడి నుంచి బయలుదేరింది.

ఆ సరికే సూర్యాస్తమయి చీకటి పడుతున్నది. అక్కడి నుంచి బయటపడేందుకు దారి వెతుకుతూ ఉద్యానానికి వెళ్ళిన శకుంతలకు, ఒక పొదరింటి చాటున విచారంగా కూర్చుని వున్న ఒక యువతి కనిపించింది. ఆమె దుస్తుల తీరు చూసి శకుంతల ఆమెను రాకుమారిగా గుర్తించి, "తెల్లవారితే పెళ్ళి! ఈ వేళప్పుడు ఇక్కడ వున్నారేం, రాకుమారీ? మీకిది ఇష్టంలేని పెళ్ళి, అవునా?" అని అడిగింది శకుంతల.

రాకుమారి నివ్వెరపోతూ, శకుంతలకేసి చూసి, "ఎవరు నువ్వు? నాకిది ఇష్టంలేని పెళ్ళని ఎలా గ్రహించావు?" అని అడిగింది.

దానికి శకుంతలచిన్నగానవ్వి,"నెలరోజుల క్రితం నేనూ, మీ పరిస్థితిలోనే వున్నాను. ఆ ఇష్టంలేని పెళ్ళి తప్పించుకునేందుకు ఇంటి నుంచి పారిపోయాను," అన్నది.

ఇది వింటూనే రాకుమారి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఆమె దేవీ ఆలయంలో విగ్రహాలు చెక్కే యువశిల్పిని ప్రేమించింది. అయితే, ఆ సంగతి తల్లిదండ్రులకు చెప్పే ధైర్యం లేక, మరొక దేశం యువరాజుతో పెళ్ళికి తలవంచింది.

"మనసు చంపుకుని ఇష్టం లేని పెళ్ళి చేసుకోవడం ఎందుకు, రాకుమారీ? సంగతి మీ తండ్రిగారికి చెప్పడానికి భయమయితే, పెళ్ళికొడుకుకే చెప్పేయండి," అని సలహా ఇచ్చింది శకుంతల.

రాకుమారి కళ్ళు మెరిశాయి. ఆమె తన వేలి ఉంగరాన్ని శకుంతలకిచ్చి, "ఇది వేలికి

ధరిస్తే నువ్వు రాజమందిరంలో ఎక్కడికైనా వెళ్ళవచ్చు. ఎలాగోలా సింహపురి యువరాజు రాజసింహుడిని ఇక్కడికి తీసుకురా!" అన్నది.

శకుంతల కాసేపు ఆలోచించి, "ఇక్కడ అయితే ఎవరైనా చూడవచ్చు. మీరు సరుకులు దాచిన చావడిలోకి వెళ్ళి, ఎక్కడైనా దాగి వుండండి. నేను యువరాజును అక్కడికి పంపుతాను," అని బయలుదేరి, తనను అడ్డగించిన రాజభటులకు, రాకుమారి ఉంగరంచూపిస్తూ, సింహపురి యువరాజు విడిది చేసిన మందిరం చేరుకున్నది.



అక్కడ యువరాజుకు, ఆమె రహస్యంగా రాకుమారి ఉంగరం చూపించి, "రాకుమారి తక్షణం మీతో ఏదో ఒక ముఖ్య విషయం గురించి మాట్లాడాలట. నా వెంటరండి!" అని అతణ్ణి వెంటబెట్టుకుపోయి, సామానులున్న చావడి చూపించి, తను దూరంగా ఒక చెట్టు కింద నిలబడింది.

యువరాజు చావట్లోకి పోయి, కొద్ది సేపట్లోనే ముఖం కందగడ్డలా చేసుకుని, శకుంతల దగ్గరకు వచ్చి, "నీపేరేమిటి?" అని అడిగాడు.

"శకుంతల!" అన్నది శకుంతల భయం భయంగా.

"చూడు, శకుంతలా! నువ్వు నాకు మహ బాగా నచ్చావు. రాజకుమారి అందచందాల గురించి అడక్కు. ఈ ముహూర్తానికే నన్ను పెళ్ళాడతావా? నువ్వా పైనుంచి ఇక్కడికి వచ్చి, తిరిగిపోదారి మరిచిన గంధర్వ కన్యలా వున్నావు," అన్నాడు యువరాజు.

యువరాజు రాజసింహుడి మాటలకు శకుంతల నివ్వెరపోయి, తానెవరైందీ చెప్పి, "యువరాజా! మీకు నేనేవిధంగానూ తగిన దానిని కాదు," అన్నది.

"నువ్వు అభ్యంతరం చెప్పడంలోనే, నీ గొప్పతనం, సంస్కారం అర్థమవుతున్నది. నా మాటకు తిరుగులేదు!" అన్నాడు రాజసింహుడు.

ఈ జరిగినదంతా క్షణాల మీద రాజాంతఃపురంలో గుప్పుమన్నది. రాజదంపతులు, తమ కుమార్తె మనసు విప్పి తమతో శిల్పిని గురించి చెప్పనందుకు బాధపడి, ముహూర్తం వేళ మించిపోకుండా, శిల్పితో తమ కుమార్తె

వివాహం, యువరాజుతో శకుంతల వివాహం జరిపించారు. ఇంత జరిగాక, రాజు స్థిమిత పడి శకుంతలతో, "నా కుమార్తె ఏదో అఘా యిత్యానికి పాల్పడకుండా కాపాడావు. నీకేం కావాలో కోరుకో!" అన్నాడు.

"నాకు మరే కోరికా లేదు, మహారాజా! మీరు పెళ్ళి సామానులు సర్దించిన చావడిలో వున్న మూడుగోతాలలో, నేను కావాలన్న గోతాన్ని నాకిప్పించండి," అన్నది శకుంతల.

ఈ కోరిక విని అందరూ అమితాశ్చర్యం చెందారు. రాజు, ఆ గోతామేదో తీసుకుపొమ్మ న్నాడు.

ప్రయాణంలో, మరుగుజ్జురాక్షసి వున్న గోతాన్ని రథంలో పెట్టించింది శకుంతల. దారిలో మరుగుజ్జురాక్షసి నివాసమైన మర్రి చెట్టు కనబడగానే, ఆమె రథాన్ని ఆపించి, "యువరాణీ! నీ నివాసభవనాన్ని చేరాం. ఇక ఏ ప్రమాదమూ లేదు. నీ గోతాం పల్లకీలోంచి బయటకు రా!" అన్నది.

వెంటనే గోతాంలోంచి బయటకు వచ్చిన మరుగుజ్జు రాక్షసిని చూసి యువరాజు తెల్ల బోయి, "నీ పేరు యువరాణీయా?" అని అడిగాడు.

మరుగుజ్జు రాక్షసి, అవునంటూ తలవూపి ఒక్క ఉరుకున మర్రి కొమ్మల్లోకి ఎగిరిపో యింది.

క్రితం రాత్రి అతడు రాకుమారితో మాట్లాడ డానికి వెళ్ళినప్పుడు, "యువరాణీ! యువ రాణీ!" అంటూ చిన్నగా పిలిచాడు. మరుగుజ్జు రాక్షసి గోతాంలోంచి బయటకు వచ్చింది.

దాన్ని చూసి యువరాజు — పగలు రాకుమారిగానూ, చీకటి పడి రాక్షసిగానూ మారే మాయలమారిగా తను పెళ్ళాడ వచ్చిన రాకుమారిని ఊహించుకుని, అప్పటికప్పుడు శకుంతలను వివాహమాడేందుకు నిర్ణయిం చుకున్నాడు.

ఈజరిగిందాన్ని గురించి అతడు శకుంత లకు చెప్పి, "ఈ మరుగుజ్జు రాక్షసి యువరాణి పుణ్యాన మన వివాహం జరిగింది. ఈ పుణ్యం కారణంగా వచ్చే జన్మలో అది తప్పక ఏ రాజకుమారిగానో జన్మ ఎత్తుతుంది!" అన్నాడు నవ్వుతూ.






## 3

[ట్రోయ్‌నగరంలో ఏటా జరిగే స్మారకోత్సవాలు చూడటానికి మోహనుడు వెళ్ళి పోటీలలో పాల్గొని అన్నింటా నెగ్గాడు. అక్కడ వర్ధనుడికి మోహనుడు తన కుమారుడేనని తెలిసిపోయింది. భువనసుందరి కోసం కామినీదేవతను నిత్యమూ అరాధించే మోహనుడు స్పార్టాకు వెళ్ళి, భువనసుందరి భర్త ప్రతాపుడు ఇంటలేని సమయంలో ఆమెను తన ఓడలో ట్రోయ్‌కి తెచ్చి పెళ్ళి చేసుకున్నాడు. భువనసుందరిని ఇచ్చెయ్యమని గ్రీకులు పంపిన రాయబారం విఫలమయింది. — తరవాత]

భువనసుందరిని మంచిగా తిరిగి తెచ్చుకునే ప్రయత్నం విఫలం కాగానే, ప్రతాపుడు గ్రీకు రాకుమారుల కందరికీ కబురు చేశాడు: "భువనసుందరిని వరించి వచ్చినప్పుడు మీరంతా తీసుకున్న ప్రమాణం ప్రకారం ఇప్పుడు మీరందరూ నాకు సాయపడండి." ఈ విధంగా కబురు పంపటమే గాక, ప్రతాపుడు గ్రీసు దేశమంతా పర్యటించి, ఒక్కొక్క రాజ్యానికీ వెళ్ళి, ప్రతి రాజునూ కలుసుకుని, వారి వారి బలాలతో సహా కదిలి తన పక్షాన యుద్ధానికి రావలిసిందిగా కోరాడు.

ఇథాకా రాజైన రూపధరుడివద్దకు ప్రతాపుడూ, అతని అన్న అయిన రారాజూ కలిసి వెళ్ళారు. కాని రూపధరుడు ఈ యుద్ధంలో చేరగూడదని అదివరకే నిశ్చయించుకున్నాడు. అందుకు కారణమేమంటే, అతను ట్రోయ్ నగరానికి వెళ్ళేపక్షంలో తిరుగుమార్గంలో అతనికి అమానుషమైన కష్టాలన్నీ కలుగుతాయనీ,



చేతిలో ఉన్న చంటి పిల్లవాణ్ణి లాక్కుని, రూప ధరుడు దున్నే చాలుకు అడ్డంగా పడుకో బెట్టారు. రూపధరుడు చప్పున తాళ్ళు లాగి నాగలిని ఆపాడు. దానితో అతనికి పిచ్చి ఏమీ లేదని రుజువయిపోయింది. అతను చివరకు యుద్ధంలో చేరక తప్పలేదు.

ట్రోయ్‌పై యుద్ధంలో చేరిన వారిలో ఉత్సాహం లేకుండా చేరినవారు లేక పోలేదు. ఒక రాకుమారుడు యాభై ఓడలను పంపుతా నని వాగ్దానం చేసి ఒక్క ఓడ మాత్రమేపం పాడు. మిగిలిన నలభై తొమ్మిది ఓడలూ ఆ ఓడలోనే ఉన్నాయి. అవి మట్టితో చేసిన బొమ్మ ఓడలు!



ఇరవై ఏళ్ళదాకా అతను ఇంటికి తిరిగిరాడనీ అశరీరవాణి అతడికి చెప్పింది.

అందుచేత రూపధరుడు యుద్ధంలో చేర కుండా తప్పించుకోవటానికి ఒక దొంగఎత్తు వేశాడు. రైతులు ధరించే కుళాయి ఒకటి నెత్తికి పెట్టుకుని, కాడికి ఒక ఎద్దునూ, ఒక గాడిదనూ కట్టి, చాళ్ళలో ఉప్పు చల్లుతూ పొలం దున్నసాగాడు. పక్కనే అతని భార్య పద్మముఖి తన చంటి కొడుకు, ధీరమతిని ఎత్తుకుని నిలబడి ఉన్నది.

రూపధరుడు వెర్రివాడుగా నటించటమే గాక, తనకోసం వచ్చిన ప్రతాపుణ్ణీ, రారాజునూ గుర్తించనట్టుకూడా నటించాడు, కాని వాళ్ళు ఎంతమాత్రమూ మోసపోలేదు. పద్మముఖి

వజ్రకాయుడనేయువకుడిసహాయంలేకుండా ట్రోయ్‌నగరం పట్టుబడదని గ్రీకులు జోస్యం ద్వారా తెలుసుకున్నారు. ఇతను తటిని అనే ఆమె యొక్క ఏడవ కుమారుడు. తన కుమారుడు ప్రపంచంలోకెల్లా గొప్ప యోధుడు కావాలనే ఉద్దేశంతో తటిని, అతని మడమను పట్టుకుని స్టిక్స్ నదిలో ముంచింది. ఈ కార ణంగా అతని శరీరం వజ్రకాయమయింది; తల్లి పట్టుకున్న మడమమాత్రం మామూలు గానే ఉండిపోయింది. వజ్రకాయుడు పసిపిల్ల వాడుగా ఉన్నప్పుడే వేటాడటంలో, పరిగెత్త టంలో, ధైర్యసాహసాలలో, సంగీతం పాడటం లోసాటిలేని వాడనిపించుకున్నాడు. అతను ఆరవఏటనేఅడవిపందిని కొట్టాడు.లేళ్ళనూ,

దుస్తులనూ వేటాడేటప్పుడతను తన పరుగుతో వాటిని అందుకునేవాడు!

వజ్రకాయుణ్ణి యుద్ధంలోకి ఆహ్వానించటానికి రూపధరుడూ, భూధవుడూ, నవద్యోతుడూ వెళ్ళారు. అయితే, తన కుమారుడు ట్రోయ్‌పైకి యుద్ధానికి వెళితే అతను ప్రాణాలతో తిరిగిరాడని వజ్రకాయుడి తల్లి, తటినికి తెలుసును. అందుచేత ఆమె వజ్రకాయుడికి స్త్రీ వేషంవేసి, ఒకానొక రాజుయొక్క అంతఃపురంలో రహస్యంగా ఉంచింది.

వజ్రకాయుడి కోసం వచ్చినవారు రాజభవనంలోని పురుషులందరినీ వెతికారు. వారిలో వజ్రకాయుడు వారికి కనిపించలేదు. అతను స్త్రీ రూపంలో అక్కడే దాగి వుంటాడని రూపధరుడికి సందేహం కలిగింది. అతన్ని బయట పెట్టటానికి రూపధరుడొక యుక్తి చేశాడు. అతను అంతఃపుర స్త్రీలకు అనేక బహుమానాలు తెచ్చాడు. వాటిలో స్త్రీల దుస్తులూ, అలంకారాలూ, ఆభరణాలూ ఉన్నాయి. వాటితోబాటు ఒక బల్లెమూ, డాలూకూడా ఉన్నాయి. ఈ బహుమానాలన్నిటినీ ఒక చోట వేయించి, ఎవరికి కావలిసినది వారు తీసుకోవచ్చునని రూపధరుడు అంతఃపుర స్త్రీలకు కబురు పంపాడు. స్త్రీలు వచ్చి తమకు కావలిసిన వస్తువులు వెతుకుతున్న సమయంలో రాజభవనం వెలుపల, రూపధరుడి ఆజ్ఞానుసారం భేరీలు మోగాయి. ఆ చప్పుడు వింటూనే స్త్రీ వేషంలో ఉన్న వజ్రకాయుడు తన స్త్రీ దుస్తులు



లాగి పారేసి బల్లెమూ, డాలూ చేబట్టాడు. వెంటనే అతన్ని రూపధరుడు పోల్చి పట్టుకున్నాడు. వజ్రకాయుడు యుద్ధంలో చేరటానికి సమ్మతించాడు.

✿ ✳ ✿ ✳ ✿

గ్రీకుల నావలు ఔలిస్ వద్ద ఆయత్తమై ఉన్నాయి. ఆ సమయంలో క్రీట్ నుంచి దూతలు వచ్చి ఒక వార్త అందజేశారు. రారాజుతో బాటు తనకు కూడా సేనానాయకత్వం ఇచ్చిన పక్షాన, తాను నూరు ఓడలతో వచ్చి యుద్ధంలో చేరగలనని క్రీట్ రాజయిన ప్రభవుడు కబురు చేశాడు. ప్రభవుడు భువనసుందరి స్వయంవరానికి వెళ్ళిన రాకుమారులలో ఒకడు. ఆయన గొప్ప అందగాడని

ప్రతీతి. ఆయన సూచన ఆమోదించబడింది. ఆయన తన నూరు ఓడలతో కదిలి వచ్చాడు.

యుద్ధానికి బయలుదేరే సమయానికి గ్రీకు పక్షాన గల మహాయోధులలో ఎవరు ఏమేమిటంటే :

సైనిక బలాలన్నిటికీ సర్వసేనాని రారాజు. ఆయన కింద ఉపసేనాపతులు రూపధరుడూ, ప్రబోధుడూ, దేవమయుడూనూ. ఓడలన్నిటి పైనా సర్వసేనా నాయకత్వం వజ్రకాయుడిది. ఆయన కింద ఉపనాయకులు భూధవుడూ, రక్తవర్ణుడూనూ. పీలస్ రాజయిన నవద్యోతుడు యోధులందరిలోకీ వృద్ధుడు, సాటిలేని యుద్ధ నైపుణ్యమూ వివేకమూ గలవాడు. మూడు తరాల ప్రజలను పరిపాలించిన ఈ పితామహుడు ముసలితనంలో కూడా యుద్ధరంగంలో ప్రచండుడు. రారాజు ఆయన సలహా లేక ఏ పనీ చేసేవాడు కాడు. యుద్ధ సంబంధమైన ఏ సమస్య వచ్చినప్పటికీ నవద్యోతుడి సలహాకూ, రూపధరుడి సలహాకూ వ్యత్యాసం ఉండేదికాదు;ఇద్దరూఒకేపద్ధతిలో ఆలోచన చేసేవారు.

అతిరథులుగా పరిగణించదగిన వీరులలో ఒకడు భూధవుడు. ధైర్యంలోనూ, బలంలోనూ, అందంలోనూ వజ్రకాయుడి తరవాత చెప్పుకోదగినవాడు భూధవుడే. అతడికి దేవతలన్నా కూడా లక్ష్యంలేదు. అతను యుద్ధానికి బయలుదేరే సమయంలో పెద్దలు, "నాయనా, యుద్ధరంగాన పరాక్రమం ప్రదర్శించి, దేవతల సహాయంతో విజయలక్ష్మిని వరించు!" అని ఆశీర్వదించారు.అప్పుడతను నిరసనగా, "దేవ



తలసహాయంతోపెరికిపందలుసయితంవిజయ లక్ష్మినివరిస్తారు!నేనుదేవతలసహాయం లేకుం డానేవిజయలక్ష్మినివరిస్తాను!"అనిపలికాడు.

ఉపభూధవుడు భూధవుడికి బంధువు కాడు. బల్లెం విసరటంలో ఉపభూధవుడికి సాటిగలవారు గ్రీకు సేనలో ఎవరూ లేరు. పరుగులో కూడా అతనిని మించగలవాడు వజ్రకాయుడొక్కడే.

దేవమయుడు భువనసుందరిని ఎంతో ప్రేమించినవాడు. మోహనుడు ఆమెను ఎత్తుకుపోవటం దేవమయుడికి ప్రత్యేకంగా ఆగ్రహం కలిగించింది. అందుచేత అతను పగతో యుద్ధానికి బయలుదేరాడు.

డిలోస్ రాజయిన ముష్కరుడు గ్రీకు సేనలకు కావలిసిన ధాన్యాలూ, ఇతర సంబారాలూ సమకూర్చి పెట్టాడు. నౌకలు బయలుదేరే ముందు రారాజు దేవతలను ప్రీతి చెయ్యటానికి అవసరమైన పూజలూ, బలులూ జరిపించాడు. కాంశుకుడు అనే దైవజ్ఞుడు నౌకలకు దారి చెప్పేవాడుగా నియమించబడ్డాడు. నిజానికి కాంశుకుడు సముద్రమార్గాలెరిగినవాడు కాడు. అతను దైవజ్ఞుడు మాత్రమే. అందుచేత గ్రీకు నౌకలు సరి అయిన మార్గదర్శి లేకుండానే బయలుదేరాయి. ఆ కారణంగా అవి ట్రోయ్ తీరానికి పోవటానికి మారుగా, దక్షిణంగా ఉన్న మీసియా తీరానికి చేరాయి. గ్రీకు సైనికులు ట్రోయ్ తీరమే చేరామనుకుని నౌకలలో నుంచి దిగి దేశం మీదపడి కొల్లగొట్టసాగారు. ఈ సంగతి తెలిసి మీసియా రాజు తన





చిన మొదటి దాడి ఈ విధంగా విఫలమై ముగిసింది.

కాని సంవత్సరం తిరగకుండానే గ్రీకు బలాలు ట్రోయ్‌పై యుద్ధానికి మళ్ళీ సమాయత్త పరచబడ్డాయి. చాలా రోజులపాటు గాలి అనుకూలంగా తిరగలేదు. చివరకు దేవతలకు బలులివ్వగా గాలి అనుకూలంగా వీచింది. నౌకలు బయలుదేరాయి. అవి దీర్ఘ ప్రయాణం చేసి లెస్బోస్‌దీవి వద్ద మొదటి సారిగా తీరాన్ని అంటాయి. ఈ దీవిని ఏలే రాజు గ్రీకు వీరులకు ఆతిథ్యం ఇచ్చాడు. అయితే, ఈయన తన అతిథులను తనతో మల్లయుద్ధం చెయ్యమని ఆహ్వానించాడు. ఆయన మల్లవిద్యలో ఘటికుడు. గ్రీకుల తరఫున రూపధరుడు ఆయనతో మల్లయుద్ధం చెయ్యటానికి అంగీకరించి, అందులో రాజును చిత్తుగా ఓడించాడు. గ్రీకుల ఆనందానికి మేరలేదు. వారి నౌకలు లెస్బోసనుంచి బయలుదేరి కొన్నాళ్ళకు టెనెడోస్ దీవి వద్ద మళ్ళీ తీరం అంటాయి.

బలాలను గ్రీకులపైకి పంపాడు. తరవాత జరిగిన యుద్ధంలో గ్రీకు సైనికులు కొందరు చావుదెబ్బ తిన్నారు. సమయానికి వజ్రకాయుడు వచ్చి మీసియా సైన్యాలను తరిమివెయ్యకపోతే గ్రీకులు పూర్తిగా నిర్మూలమై ఉందురు.

తాము చేరినది ట్రోయ్‌తీరం కాదని ఈలోపుగా గ్రీకులు తెలుసుకున్నారు. వారు తిరిగి తమ నౌకలలో బయలుదేరారు. కాని సముద్రం మీద ప్రచండమైన తుఫాను చెలరేగి నౌకలు తలా ఒకదారి అయిపోయాయి. ఆ తరవాత అవి తిరిగి సమావేశం కాలేదు. ఒక్కొక్క గ్రీకు రాకుమారుడూ తన నౌకలను తన దేశానికి నడుపుకుపోయాడు. ట్రోయ్‌పై సాగిం

టెనెడోస్ దీవికి ట్రోయ్‌నగరం ఇరవైమైళ్ళ లోపు ఉంటుంది. ట్రోయ్ కోట గోడలపైకి ఎక్కితే ఈ దీవి దూరాన సముద్రంలో కనిపిస్తూ ఉంటుంది. మిగిలిన వారందరినీ ఈ దీవిలోనే ఉంచి రూపధరడూ, భువనసుందరి భర్త అయిన ప్రతాపుడూ, ప్రబోధుడూ ట్రోయ్ నగరానికి రాయబారం వెళ్ళారు. మంచిగా భువనసుందరిని తమకు వప్పగించమని

అడగటమే వారి ఉద్దేశం. అయితే ట్రోయ్ పౌరులు భువనసుందరిని వప్పగించగూడదని ఏనాడో నిశ్చయించారు. గ్రీకుల రాయబారం విఫలం కావటమేగాక, రాయబారులను చంప టానికి కూడా యత్నంజరిగింది.కాని, రాయ బారులకు ఆతిథ్యం ఇచ్చిన గృహస్థు అడ్డుపడి, రాయబారులను చంపటం కంటే నీచమైన పని ఉండదనీ, అటువంటి పనికి తానెన్నడూ సమ్మతించననీ గట్టిగా చెప్పాడు.

ఆఖరు రాయబారం విఫలం కాగానే గ్రీకు నౌకలు టెనెదోస్ దీవి నుంచి కదిలి ట్రోయ్ తీరానికి వచ్చాయి. నౌకలు విడిసిన చోటికి ట్రోయ్ కొటగోడలు కనిపిస్తాయి. గ్రీకు నౌకల రాక కనిపెట్టి ట్రోయ్ పౌరులందరూ నగరం వెలువడి సముద్రతీరానికి వచ్చి, నౌకల మీద రాళ్ళవర్షం కురిపించి, వాటిని తిప్పికొట్టా లని యత్నించారు. కాని నౌకలు తీరాన్ని అంటాయి.

అయితే ఇప్పుడొక పెద్ద సమస్య వచ్చింది. ట్రోయ్ భూమిమీద ముందుగా ఎవరు అడుగు పెట్టేట్టు? ఈ సమస్యకు కారణమేమంటే, మొట్టమొదటగా ట్రోయ్‌గడ్డ మీద అడుగు పెట్టిన యోధుడు యుద్ధంలో మొట్టమొదటగా మరణిస్తాడని జ్యోస్యం చెప్పబడింది. ఈ జ్యోస్యంలో గ్రీకులందరికీ నమ్మకం కుదిరింది. అందుచేత వజ్రకాయుడివంటి ధైర్యశాలికూడా మొదటగా నౌకనుంచి దిగటానికి జంకాడు.

ఆ పనిచేసిన ధీరుడు చంద్రప్రభుడనే వాడు. అతను నౌకలోనుంచి ఒడ్డుకు దూకుతూనే యుద్ధానికి తలబడి, అనేక మంది శత్రువులను సంహరించాడు. అతనిని వీర సింహుడు చంపేశాడు.

చంద్రప్రభుడి వెనకగా వజ్రకాయుడు నౌకనుంచి దూకాడు. అతని వెనకనే అతని వెంటవచ్చిన సైనికులందరూ దూకారు. వజ్రకాయుడు కొందరు ట్రోజన్ వీరులను చంపినాక మిగిలిన వారంతా చెల్లాచెదురుగా నగరంలోకి పారిపోయారు.

ఈలోగాగ్రీకుసైనికులందరూ ఉత్సాహంగా కేకలువేస్తూ, పడవలలో నుంచి ఒడ్డుకు దిగారు. — (ఇంకావుంది)



## కొబ్బరికాయ పీచు వలవడంలో నేర్పు!

మామూలుగా కొబ్బరికాయను వలవాలంటే కత్తి, ఉలి లేదా పదునైన పరికరం ఏదైనాఒకటి కావాలి. ఆ పరికరంతో కొబ్బరికాయ చుట్టూ నిలువునా గీతలు గీతలుగా గాట్లు వేసి వలవడం ఓ పెద్ద తతంగం. అయితే, ఏ పరికరం లేకుండా, తన పళ్ళతోనే కొబ్బరి కాయ పీచును 20 సెకనులలో వలిచేస్తున్నాడు కేరళ లోని కాలికట్‌కు చెందిన జోస్. ఎండుకొబ్బరికాయ అయితే 30 సెకనులవుతుంది. ముప్పై రెండేళ్ళు నిండిన జోస్ 'అడ్వర్టయిజ్‌మెంట్ ఫిల్మ్స్' తీస్తుంటాడు. ఆయన తన సామర్థ్యాన్ని గుర్తించి తన పేరును 'గిన్నిస్‌బుక్ ఆఫ్ రికార్డ్స్'లో చేర్చమని దానిప్రచురణకర్తలకు రాశాడు!



## ఈనాటి 'కామధేనువు!'

హరిద్వారంలోని ఒక ఆశ్రమంలో 'శ్యామ'అనే ఆవు ఉన్నది. అక్కడివాళ్ళు దానిని 'కామధేనువు' అనే పిలుస్తున్నారు. ఎందుకంటే అది గత ఎనిమిదేళ్ళుగా ఆపకుండా పాలు ఇస్తున్నది. 1980వ సం॥లో ఇది మొదట ఈనినప్పుడు రోజుకు 35 — 40 లీటర్ల పాలు ఇచ్చేది. 1982లోనూ, 1984లోనూ రెండు దూడలను ఈని ఆ తరవాత ఈతకు రాలేదు. కాని పాలివ్వడం మాత్రం మానలేదు. దానికిప్పుడు 17 సంవత్సరాలయింది. అయినా, ముసలి లక్షణాలు కనిపించలేదు. ఇప్పుడు కూడా రోజుకు 6 నుంచి 15 లీటర్ల వరకు పాలిస్తున్నది. దాని మొదటి దూడకు ఇప్పుడు 13 సంవత్సరాలు, అప్పుడే పళ్ళు రాలిపోయి ముసలిదైపోయింది!



## పొడవైన కారు!

ప్రపంచంలోకెల్లా చాలా పొడవైన కారు లండన్‌లోని 'రాఫ్ మ్యూజియం'లో ఉన్నది. 1982 క్యాడిలాక్ అనే ఈ కారు పొడవు 22 మీటర్లు. ఐదు అంతస్తుల మేడ అంత ఎత్తున్న దీని బరువు 7 టన్నులు. మామూలు రోడ్ల మీద వెళితే, ట్రాఫిక్‌కు అంతరాయం కలుగుతుందన్న అనుమానంతోనేమో ఇటీవలి కాలంలో దానిని ఉపయోగించలేదు. ఇప్పుడేమో స్థలాభావం ఏర్పడి మ్యూజియంను విస్తరించవలసి వచ్చింది. కాబట్టి దానిని ఎవరికైనా విక్రయించాలని అధికారులు నిర్ణయించారు. మరి ఎవరు కొంటారో తెలియదు!




# శత్రువు-శత్రుత్వం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ప్రతిసారీ విఫలమవుతున్నా, అనుకున్న కార్యాన్ని సాధించి తీరాలన్న నీ పట్టుదలా, ఓర్పూ మెచ్చదగినవే. కాని, కార్యసాధన తర్వాత నీ ప్రవర్తన ఎలా వుండబోతున్నదన్న విషయంలో నాకొక అనుమానం కలుగుతున్నది. ఒకవేళ నువ్వు బలవంతుడైన శత్రువును సంహరించేందుకు ఏదైనా అలౌకిక శక్తిని సంపాదించదలిస్తే మాత్రం, ముందుగా నీకొక హెచ్చరిక చేయదలిచాను. అదేమంటే — ప్రతి వ్యక్తీ పూనుకున్న కార్యం సాధించేందుకు ప్రదర్శించినంత పట్టుదలను. కార్యసాధన తర్వాత దాన్ని సద్వినియోగం చేసుకునేందుక్కూడా ప్రదర్శించాలి. అయితే, ఇందుకు పట్టుదలతో పాటు ఎంతో వివేకం,

## బేతాళ కథలు



సమయస్ఫూర్తి కూడా అవసరం. అవి లేనప్పుడు పడిన శ్రమంతా వృథా అవుతుంది. ఇందుకు ఉదాహరణగా, వివేకుడనే వాడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

ప్రతాపపురంలో వుండే వివేకుడు, యోచనుడి ఒక్కగా నొక్క కొడుకు. తండ్రి మంచి గుణాలన్నీ పుణికి పుచ్చుకున్నాడు. వాడికి తండ్రి అంటే పంచ ప్రాణాలు.

యాభై ఏళ్ళ వయసులో యోచనుడికి గుండెపోటు వచ్చింది. వైద్యుడు వచ్చి చూసి, "నువ్విక విశ్రాంతి తీసుకో. అన్ని బాధ్యతలూ నీ కొడుక్కు అప్పజెప్పి మనసును ప్రశాంతంగా వుంచుకో," అని చెప్పాడు.

ఆ ప్రకారం వివేకుడు ఇంటి బాధ్యతలు తీసుకున్నాడు. అలా వారం రోజులు గడిచాయో లేదో, దూర గ్రామం నుంచి జగ్గరాజనే వాడు వచ్చి వివేకుణ్ణి కలుసుకుని, "నేను నీ పెదనాన్న కొడుకును. నీ తండ్రి మా నాన్నను మోసం చేసి ఆస్తి కాజేశాడు. అందువల్ల మా కుటుంబం సర్వనాశనమయింది. ఇప్పుడు నన్నాదుకోవడం నీ బాధ్యత!" అన్నాడు.

వివేకుడాశ్చర్యపడి, "పరోపకారానికి మా నాన్న ఎన్నడూ వెనుదీయడు. నిన్నాదుకోవడానికి నాకు అభ్యంతరం లేదు. కానీ ఆయన మీ నాన్నను మోసం చేయడం అబద్ధం. ఆ మాట ఒప్పుకో!" అన్నాడు.

"నిజానిజాలు మీ నాన్న ముందే తేల్చేస్తాను. మీ నాన్న వద్దకు పద," అన్నాడు జగ్గరాజు పౌరుషంగా.

"నాన్నకు గుండెజబ్బు. ఈ సమయంలో ఆయనముందు గొడవ వద్దు. నేను, నాన్న అన్నదమ్ములందరినీ కలుసుకుని, ఈ విషయమై వాళ్ళ అభిప్రాయాలు కాగితం మీద వ్రాయించుకుని వస్తాను. అప్పుడు నిజం బయటపడుతుంది. అంతవరకూ నువ్వు, మా నాన్నను కలుసుకోకు," అంటూ వివేకుడు అప్పటికప్పుడు ప్రయాణమయ్యాడు.

నిజానికి జగ్గరాజు పరమ దుష్టుడు. వాడి తండ్రి కూడా, వాడి బుద్ధులు నచ్చక ఇంట్లోంచి గెంటేశాడు. వివేకుడు తనవద్దకు రాగానే, జగ్గరాజు తండ్రి జరిగింది తెలుసు

కుని ఎంతో నొచ్చుకున్నాడు. తన తమ్ముడు యోచనుడి గురించి జగ్గరాజు చెప్పినవన్నీ అబద్ధాలనీ, అతడెంతో మంచివాడనీ వివేకుడికి కాయితం రాసి ఇచ్చాడు.

అదేవిధంగా మిగతా ఇద్దరన్నదమ్ములూ వివేకుడికి కాయితాలు రాసి ఇచ్చారు. అవి తీసుకుని వివేకుడు ఉత్సాహంగా ప్రతాపపురం వచ్చేసరికి, అప్పటికే అక్కడ జరగకూడని ఘోరం జరిగిపోయింది.

వివేకుడు వెళ్ళిన తర్వాత జగ్గరాజు అతడి తండ్రి యోచనుణ్ణి కలుసుకుని, ఆయనమీద లేనిపోని నిందారోపణ చేశాడు. యోచనుడు ఆవేశపడ్డాడు. దానితో ఆయనకు మళ్ళీ గుండెపోటు వచ్చి ప్రాణాలు విడిచాడు.

ఇలా జరుగుతుందని ఊహించని జగ్గరాజు, వివేకుడికి క్షమాపణ చెప్పుకోవాలనుకున్నాడు. కానీ, జరిగింది తెలియగానే వివేకుడు పట్టరాని కోపంతో, "మళ్ళీ నీ మొహం నాకు చూపించకు!" అని జగ్గరాజును ఇంట్లోంచి తరిమేశాడు.

తండ్రి పోయిన దుఃఖం నుంచి బయటపడడానికి వివేకుడికి ఏడాది పట్టింది. ఆ తర్వాత వాడు తల్లి బలవంతం మీద పెళ్ళికి ఒప్పుకున్నాడు. ఒక గ్రామానికి పెళ్ళి చూపులకు వెళితే, పిల్ల వాడికి బాగా నచ్చింది. పెళ్ళి కూతురు తండ్రి వాడితో, "బాబూ, మీ ఉత్తమ సంప్రదాయం గురించి, మీ పెదనాన్న కొడుకు జగ్గరాజు చెప్పగా విన్నాం.



ఆయనకు పిల్లనిద్దామని వెళితే, ఆయనే తను మా అమ్మాయికి తగననీ, మీవంటి ఉత్తముణ్ణి అల్లుడిగా చేసుకోమనీ సలహా ఇచ్చాడు," అని చెప్పాడు.

జగ్గరాజులో మంచి మార్పు వచ్చిందని వివేకుడి తల్లి ఎంతో సంతోషించింది. అయితే వివేకుడు మాత్రం, "వాడు మనకు శత్రువు. వాడీ సంబంధం గురించి చెబుతున్నాడంటే, ఇందులో ఏదో మర్మముంటుంది. మనకీ సంబంధం వద్దు," అన్నాడు.

ఆ తర్వాత జగ్గరాజు ప్రసక్తి ఏమాత్రమూ లేకుండా ఒక పెళ్ళి సంబంధం కుదుర్చుకున్నాడు. జగ్గరాజును పెళ్ళికి పిలవలేదు. కొన్నాళ్ళకు జగ్గరాజుకూ పెళ్ళి కుదిరింది.



జగ్గరాజు వచ్చి వివేకుడి నాహ్వానించి వెళ్ళాడు. అయినా వివేకుడు పెళ్ళికి వెళ్ళలేదు.

పెళ్ళయిన ఏడాదికి వివేకుడి పొలాల పక్కనే మరొక పదెకరాల భూమి అమ్మకానికి వచ్చింది. కొంత తక్కువ ధరకు వస్తున్నదని, మొత్తం పదెకరాలూ తనే కొనేయాలనుకున్నాడు వివేకుడు. కానీ వాడిదగ్గర డబ్బంతా కలిపినా ఇంకా వెయ్యి వరహాలు తక్కువయింది. వాడు ఎక్కడైనా అప్పు చేయాలనుకుంటూండగా, పట్నంనుంచి రంగనాథం అనే వ్యాపారి, వాడి దగ్గర రెట్టింపు ధరకు ధాన్యం కొనడానికి వచ్చాడు. ఉన్నట్టుండి వివేకుడు పండించే మేలురకం ధాన్యానికి పట్నంలో గిరాకీ పెరిగిందట!

ఇందుకు వివేకుడు చాలా సంతోషించాడు. ధాన్యం ఈవిధంగా అమ్మితే, ఆ వచ్చిన అదనపు డబ్బుతోనే పదెకరాల పొలమూ కొనివేయవచ్చు. వాడు రంగనాథంతో, "ఈ చుట్టుపక్కల ఈ కొత్త రకం ధాన్యం నేనొక్కడినే పండిస్తున్న విషయం మీదాకా రావడం ఆశ్చర్యంగా వుంది!" అన్నాడు.

"మీ పెదనాన్న కొడుకు జగ్గరాజు చెబితే తెలిసింది. మీరు చాలా నిజాయితీపరులనీ, సరుకు నాణ్యత విషయంలోనూ, తూకం విషయంలోనూ తేడా రాదనీ కూడా ఆయన చెప్పాడు," అన్నాడు రంగనాథం.

అంతే! భార్య ఎంత చెప్పినా వినకుండా, రంగనాథాన్ని ఉత్త చేతులతో పంపేశాడు వివేకుడు. ఇది చూసి వాడి భార్య, "బావగారు జరిగిందానికి బాధపడుతున్నారు. తన తప్పు దిద్దుకునేందుకు పలు విధాల ప్రయత్నిస్తున్నారు. మీరాయన మీద కోపంకొద్దీ వివేకహీనులై అనవసరంగా నష్టపోతున్నారు," అని హెచ్చరించింది.

"జగ్గరాజు నాకు శత్రువు. ఒకే ఒకసారి వాడిని నమ్మినందువల్ల, నా తండ్రి ప్రాణాలు పోయాయి. వాడిని నమ్మడం వల్ల, కూడదీసుకోలేని నష్టం కలుగుతుంది. నమ్మకపోవడంవల్ల వచ్చే చిన్న నష్టాలు నేను భరించగలను," అన్నాడు వివేకుడు.

ప్రతాపపురంలో వివేకుడికి మంచి పేరే వున్నా, జగ్గరాజు వల్ల కొంత మచ్చ కూడా

వచ్చింది. శత్రుత్వం వహించి జగ్గరాజు చేసే మంచిని కూడా పొందలేకపోతున్నాడని, అంతా వాణ్ణి గురించి అనుకోసాగారు.

కొందరు మిత్రులు వాణ్ణి హెచ్చరిస్తూ, "నీకు నష్టం కలగాలనే — తెలివిగా పథకం వేసి జగ్గరాజు నీకు లాభం కలిగే చోటుకు వెళ్ళి, తన పేరు చెబుతున్నాడు. నువ్వు శత్రుత్వం మరచిపోయి వివేకంతో వ్యవహారాలు సరిదిద్దుకో," అని చెప్పారు.

ఇందుకు వివేకుడు నవ్వి వూరుకున్నాడు.

కొందరు ఎరిగినవాళ్ళు జగ్గరాజు పేరును వివేకుడి వద్ద తెలివిగా ఉపయోగించి తమ పనులు చేసుకోసాగారు.



ఒకసారి సత్తెయ్య, సూరయ్య అనే వ్యాపారులు వివేకుడి వద్ద కొబ్బరికాయలు కొనడానికి తమలో తాము పోటీపడ్డారు. వాళ్ళల్లో సత్తెయ్య ముందుగా వివేకుణ్ణి కలుసుకుని, "ఆ జగ్గరాజు, సూరయ్యకేదో ఉపాయం చెప్పాడట! వాడు మీ దగ్గర కొబ్బరికాయలన్నీ తనే కొనేస్తాననీ, నాకు దొరకనివ్వననీ అంటున్నాడు," అని చెప్పాడు.

ఆ రోజే వివేకుడు, తనదగ్గరున్న కాయలన్నీ సూరయ్యకు మిగల్చకుండా సత్తెయ్యకు అమ్మేశాడు. వాడి భార్య జరిగిందేమిటో గ్రహించి, "ఒక్క జగ్గరాజు పేరు చెప్పి ఎందరో మిమ్మల్ని మోసం చేస్తున్నారు. వాళ్ళందర్నీ మీరు మిత్రులంటూ గౌరవిస్తూ ఎంతో నష్టపోతున్నారు. జగ్గరాజును నమ్మితే మీ నష్టమూ తగ్గుతుంది, మంచి పేరూ వస్తుంది. మీ మిత్రుల కంటే, ఆ జగ్గరాజే నయం కదా!" అని భర్త దగ్గర గోలపెట్టింది.

దానికి వివేకుడు కటువుగా, "అందరి మోసాలూ నాకు తెలుసు. అందువల్లనే నేను నష్టపోవడం లేదని గ్రహించాకనే ముందడుగు వేస్తున్నాను. రోజురోజుకూ మన ఆస్తి పెరుగుతున్నదే తప్ప తరగడం లేదు కదా! ఊరికే ఎందుకు కలవరపడతావు? ఇక జగ్గరాజు సంగతంటావా? వాడు నా మిత్రుల కంటే నయమెలా అవుతాడు? నా తండ్రి ప్రాణాలు తీసినవాడిని, ఈ జన్మకు నేనెలా నమ్మగలను? తెలిసి తండ్రి ప్రాణాలు తీసినవాడిని గౌరవించి తెచ్చుకునే మంచి



మరికొందరు ఏం చేయాలో పాలుపోక కల వరపడుతూ అక్కడే నిలబడ్డారు.

ఆ సమయంలో అటుగా వెళ్తున్న వివేకుడు విషయం తెలుసుకుని, "అలానిలబడిచూస్తారేం? వైద్యం జరిగేలోగా విషాన్ని బయటకు లాగే యాలి," అంటూ చప్పున జగ్గరాజు ముందు కూర్చుని, పాము కాటుపడ్డ కాలిని రెండు చేతులతోనూ పైకిఎత్తి నోటితో విషాన్ని బయటకు లాగి ఉమ్మేశాడు. అలా నాలుగుసార్లు చేసేసరికి వాడికీ స్పృహ తప్పింది. ఈలోగా వైద్యుడు వచ్చాడు. స్పృహ తప్పిన ఇద్దరినీ తనఇంటికితరలించి వైద్యం ప్రారంభించాడు.

ఇదొక విడ్డూరంగా అందరూ చెప్పుకో సాగారు.

"వివేకుడికి తన తప్పు తెలిసింది. ఎలా సవరించుకోవాలా అని ఎదురుచూస్తున్నాడు," అని కొందరన్నారు.

"రక్షించడం చేతనైనప్పుడు రక్షించకపోవడంకూడా హత్య చేసినట్లే అవుతుంది. జగ్గరాజు చనిపోతే ఆ హత్యాపాతకం తనదవుతుందని, వివేకుడు భయపడ్డాడు," అని కొందరన్నారు.

కొంతసేపటికి వివేకుడికీ, జగ్గరాజుకూ స్పృహ వచ్చింది. వైద్యుడు ప్రాణ గండం తప్పిందన్నాడు.

జగ్గరాజు జరిగింది తెలుసుకుని, వివేకుడితో, "నువ్వు సామాన్యుడివి కాదు, మహాత్ముడివి! పరమ శత్రువును రక్షించడానికి

పేరు కంటే, వాడిని ఆజన్మాంతం శత్రువుగా భావించి, తెచ్చుకునే చెడ్డపేరే నాకు తృప్తి నిస్తుంది. ఇంకెప్పుడూ నువ్వు, నాదగ్గర వాడి ప్రసక్తి తీసుకురాకు," అన్నాడు.

ఆ తర్వాత భార్య ఎన్నడూ వివేకుడి వద్ద జగ్గరాజు ప్రసక్తి తీసుకురాలేదు.

కొద్ది రోజులు గడిచాక ఒక విచిత్రం జరిగింది.

ఏదో పనిమీద ప్రతాపపురం వచ్చిన జగ్గరాజు, చీకటి పడేవేళకి వీధిన పోతుండగా, విషసర్పం ఒకటి అతణ్ణి కాటేసి పారిపోయింది. నురగలు కక్కుతూ అతడు పడిపోతే చుట్టూ జనం మూగారు. కొందరు వైద్యుడింటికీ, కొందరు మంత్రగాడింటికీ పరిగెత్తారు.

ప్రాణాలకు తెగించడం అందరికీ సాధ్యప డదు," అంటూ వాడికి రెండు చేతులూ జోడించి నమస్కరించాడు.

"నువ్వు నా శత్రువు.నేను ఈ పొగడ్తలనూ, నమస్కారాలనూ కూడా నమ్మను," అంటూ వివేకుడు అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, జగ్గ రాజు వివేకుడి తండ్రి మరణానికి కారకుడై, అతడికెంతో మానసికక్షోభ కలిగించాడు. ఇందువల్ల, వివేకుడు అతణ్ణి తన శత్రువుగా భావించడంలో ఆశ్చర్యం ఏమీలేదు. అయితే, అటువంటి శత్రువును విషసర్పం కాటు వేసిన ప్పుడు,వివేకుడు తన ప్రాణాలకు తెగించి అతణ్ణి కాపాడడం ఏమన్న వివేకం అనిపిం చుకుంటుంది? తను సాధించలేని కార్యాన్ని అనుకోకుండా విషసర్పం సాధించినప్పుడు, వాడు సంతోషించి వుండవలసిందిగదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "వివేకుడు సహ జంగా దయాదాక్షిణ్యాలూ, మానవతా గుణం వున్నవాడు. అదేసమయంలో ఎంతో వ్యవ హార జ్ఞానం, ఇంగితబుద్ధీ కలవాడు. ఆ కారణం వల్లనే అతడు శత్రువునూ నమ్మ లేదు, శత్రుత్వాన్నీ నమ్మలేదు. శత్రువు, శత్రు భావం అనేవి తరచి చూసినప్పుడు వేర్వేరు మానసిక ప్రవృత్తులకు చెందుతాయి. ఒకసారి జగ్గరాజు వల్ల తీరనినష్టం కలిగిన కారణంగా, వివేకుడు స్వలాభానిక్కూడా శత్రువైన జగ్గ రాజును నమ్మక, అతడికి దూరంగా వున్నాడు. శత్రుత్వాన్ని నమ్మే వాడు శత్రువును ద్వేషిస్తూ, అతడికెలా అపకారం చెయ్యాలా అని ఆలో చిస్తాడు. అయితే, శత్రుత్వాన్ని నమ్మక పోవడంవల్ల వివేకుడిలో జగ్గరాజు పట్ల ద్వేషం లేదు. అందువల్లనే అతడు ప్రాణా పాయ స్థితిలో వున్న జగ్గరాజును కాపాడేం దుకు తన ప్రాణాలొడ్డడానికి సిద్ధపడ్డాడు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. — (కల్పితం)

[ఆధారం : జొన్నలగడ్డ రామలక్ష్మి కథ]



# రాళ్ళగుట్టమీద లాంతరు

హేలాపురి నుంచి అత్యవసరంగా విశాలనగరం వెళ్ళవలసివచ్చింది, జమీందారు కేతనవర్మకు. అర్ధరాత్రి సమయం అయినా, ఆయన తన హెూదా సంగతి మరవలేక రథం మీద బయలు దేరాడు. అడవి మార్గం చీకటిగా వుంది. అతి జాగ్రత్తగా రథం నడుపుతున్నాడు సారథి.

హఠాత్తుగా మార్గ మధ్యంలో ఒక రాళ్ళ గుట్ట అడ్డం వచ్చింది. రథం ఆ గుట్టకు గుద్దుకొన బోయి ఆగిపోయింది. చివరిక్షణంలో గుట్ట మీద వెలుగుతున్న లాంతరు వెలుగులో గుట్టను చూసి, సారథి రథం ఆపగలిగాడు. లేకపోతే రథం గుట్టకు గుద్దుకుని తలక్రిందులై వుండేది.

జమీందారు రథం దిగాడు. ప్రక్కనే ఒక చెట్టు క్రింద ముడుచుని పడుకున్న ముసలివాడొకడు లేచివచ్చి, జమీందారుకు నమస్కరించాడు.

"ఈ గుట్ట మీద లాంతరు పెట్టింది నువ్వేనా?" అని అడిగాడు జమీందారు.

"అవును, బాబూ, నేనే! అడవిమార్గం గదా, అందునా రాత్రి — చీకటి!" అన్నాడు ముసలివాడు.

"నీ వలన పెద్ద ప్రమాదం తప్పింది! ఇవి వుంచు," అని కొన్ని వరహాలు ముసలివాడికిచ్చాడు జమీందారు.

ముసలివాడు ఆనందంగా వాటిని తీసుకుని కదల బోతున్నంతలో, జమీందారు కొక అను మానం వచ్చి, "మార్గానికడ్డంగా, ఈ రాళ్ళగుట్ట ఎలా వచ్చింది?" అని అడిగాడు.

"అదా, బాబూ! లాంతరు కిందపెడితే సరిగా కనబడదని, నేనే రాళ్ళను గుట్టగా చేర్చి లాంతరు దానిమీద పెట్టాను," అన్నాడు ముసలివాడు తాపీగా. — కోనే నాగ వెంకట ఆంజనేయులు



# చందమామ అనుబంధం — 74

## మనదేశపు చెట్లు :

## పోకచెట్టు



కిళ్ళీలో తమలపాకు, సున్నంతో పాటు సుపారీ అనే పోకచెక్క పొడిని కలుపుతారన్న విషయం అందరికీ తెలిసినదే. కిళ్ళీలో పొగాకు చేర్చకపోయినా, పోకచెక్కపొడి మాత్రం తప్పక చేర్చితీరవలసిందే.

పొడవాటి పోకచెట్ల నుంచి కాచే పోకచెక్కకు మంచి వ్యాపార విలువ ఉన్నది. ఎందుకంటే ఇది తాంబూలానికే కాకుండా ఇందులో లభించే 'టానిన్' అనే రసాయనిక పదార్థాన్ని – నల్ల, ఎర్ర సిరా తయారుచేయడానికి ఉపయోగిస్తారు. ఈ గింజలను వేయించి పొడిచేసి, పళ్ళపొడి తయారుచేయడానికి కూడా ఉపయోగిస్తారు.

సన్నటి బోదెలతో దాదాపు 18 – 20 మీటర్ల ఎత్తు ఎదిగే పోకచెట్లు చూడడానికి అందంగా ఉంటాయి. చెట్టుకు కొమ్మలుండవు. బోదె 15 సెం.మీ. అడ్డుకొలత కలిగివుంటుంది. పోకకాయలను కోసే వాళ్ళు, ఒక చెట్టు పైకి ఎక్కి కాయలు కోశాక, అక్కడి నుంచి కిందికి దిగి వచ్చి, మరొక చెట్టు ఎక్కడానికి బదులు, ఆ చెట్టుపై నుంచే దానిని కొద్దిగా వాల్చి, అలాగే మరొక చెట్టు మీదికి 'టార్జాన్'లాగాదాటుకోవడంచూడడానికివింతగాఉంటుంది. ఆ విధంగా చెట్ల కాయలన్నిటినీ కోసుకుని ఒకేసారి కిందిక్కి దిగుతారు. పోకచెట్లు సులువుగా వంగడంవల్ల ఇది సాధ్యమవుతుంది. కొబ్బరి చెట్లు అలా వంగవు.

పోకచెట్లు సాధారణంగా ఐదేళ్ళు నిండాక, ఆ తరవాత కాపుకు వస్తాయి. ఒక్క సంవత్సరంలో మూడు వందల దాకా కాయలు కాస్తాయి. పిందెలుగా వున్నప్పుడు పచ్చగా కనిపించే కాయలు, ముదిరాక నారింజ రంగుకూ, పండిన తరవాత ఎరుపు రంగుకూ మారతాయి. కోడిగుడ్డు పరిమాణంలో పీచుతో నిండిన కాయ లోపల పెద్ద గింజ ఉంటుంది. పోకచెట్లకు ఎక్కువ వర్షపాతం కావాలి. కాబట్టి వానలు బాగా కురిసే కేరళ, పశ్చిమ బెంగాల్, అస్సాం ప్రాంతాలలో ఇవి ఎక్కువగా కనిపిస్తాయి.

ఆకుల కింద పువ్వులు గుత్తులు గుత్తులుగా పూస్తాయి. పూలకు రక్షణగా దొప్పలు ఉంటాయి. ఆకులు మట్ట చివర చిన్నచిన్నవిగా చీలి ఉంటాయి. ఈ ఆకులను గుడిసెలకు పైకప్పుగానూ, చెట్టుబోదెను నరికి గుంజలుగానూ ఉపయోగిస్తారు.

వృక్షశాస్త్రంలో 'ఏరికా కేటెచులిన్' అని పిలువబడే ఈ రకం పోకచెట్టును హిందీ, మరాఠీ, గుజరాతీ భాషలలో సుపారీ అనీ, బెంగాలీలో గువా అనీ, తమిళంలో కముగు అనీ, మలయాళంలో కవుంగు అనీ అంటారు.

## మనదేశపు మహాకవులు :



# వేదవ్యాసుడు

ప్రపంచంలో అతి ప్రాచీనమైనది వేద వాఙ్మయం. ఋగ్వేదం. యజుర్వేదం, సామ వేదం, అథర్వణ వేదం అనే నాలుగు వేదాలు అతి ప్రాచీన గ్రంథాలు. వీటిని ఎవరు ఎప్పుడు రచించారో ఇతమిత్థంగా చెప్పడానికి తగిన ఆధారాలు లేవు. కాని, ఆరువేల సంవత్సరాలకు పూర్వం వీటి రచన జరిగివుండవచ్చని పండితులు భావిస్తున్నారు. ఋషులు ధ్యాననిమగ్నులై వున్నప్పుడు భగవంతుడి ద్వారా వారిమనసులలో వేద మంత్రాలు స్ఫురించినట్టు చెప్పుకోవడం సంప్రదాయంగా వస్తున్నది. అంటే, వేదమంత్రాలు మానవ మేధస్సు నుంచి కాకుండా, భగవత్ ప్రేరణ నుంచి ఆవిర్భవించినట్టు చెబుతారు.

ఒకటిగా కలిసిపోయిన వేదమంత్రాలను నాలుగు భాగాలుగా విభజించి వాటికి నాలుగు పేర్లు పెట్టిన వాడు వేదవ్యాసుడు. అయినా,ఆ తరవాత కూడా వేద సూత్రాలను లిఖితబద్ధం చేయలేదు. గురువులు వేదమంత్రాలను చెబుతూంటే శిష్యులు విని అలాగే వల్లిస్తూ మనసులలో నిలుపుకుని తమ శిష్యులకు నేర్పేవారు. చాలా కాలం తరవాతే వాటిని లిఖితబద్ధం చేశారు.

భారత రచన ద్వారా భారతీయ సంస్కృతిని సుసంపన్నం చేసిన మహనీయుడు వ్యాసుడు. మనదేశంలో రామాయణం లాగానే ప్రసిద్ధిగాంచిన మహా ఇతిహాసం మహాభారతం. మరే ప్రపంచ భాషలోనూ ఇంత పెద్ద గ్రంథం లేదు. హోమర్ రచించిన ఇలియడ్, ఒడిస్సీ రెండూ కలుపుకున్నా దానికి ఎనిమిది రెట్లు పెద్దది మహాభారతం. సజీవ పాత్ర చిత్రణతో, అద్భుత ఘట్టాలను మనోహరంగా వర్ణిస్తూ,మానవజీవితంలోని లోతుపాతు

లను, మంచి చెడ్డలను, ధర్మాధర్మాలను, శాస్త్ర సంప్రదాయాలను రసవత్తరంగా విశదీకరించే మహోత్కృష్ట గ్రంథం మహాభారతం. వ్యాసుడు భారత రచన చేయడమే కాకుండా, అందులో ఒక పాత్రగా కూడా కనిపించడం విశేషం!

వ్యాసుడు మహాభారత రచనకు సంకల్పించి, లేఖకుడి కోసం ఆలోచిస్తూండగా, బ్రహ్మదేవుడు కనిపించి, విఘ్నేశ్వరుణ్ణి నియమించుకోమని ఆదేశించాడట. లేఖకుడుగా వచ్చిన విఘ్నేశ్వరుడు, వ్యాసుడికి తాను ఘంటం ఆపకుండా నిర్విరామంగా శ్లోకాలు చెప్పాలని నియమం పెట్టాడు. వ్యాసుడు అందుకు అంగీకరించి,తాను చెప్పే ప్రతి శ్లోకాన్నీ అర్థం చేసుకోకుండా రాయ కూడదని విఘ్నేశ్వరుడికి ప్రతినియమంపెట్టాడు. అందుకు విఘ్నేశ్వరుడు కూడా అంగీకరించాడు. ఇరువురూ బదరికాశ్రమ సమీపంలోని 'వ్యాస గుహ'లోకి వెళ్ళి ఏకధాటిగా రచన సాగించి రెండున్నర సంవత్సరాలలో భారతాన్ని పూర్తిచేశా రని చెబుతారు!

వ్యాసుడు అంటే సంకలనకర్త, వివరించు వాడు అని అర్థం. పవిత్ర వేదమంత్రాలను సేక రించి విభజించిన మేధావి వేదవ్యాసుడు. వ్యాసుడికి కృష్ణద్వైపాయనుడు అనే పేరుకూడా ఉన్నది.

వ్యాసుడు భారతాన్నే కాకుండా అష్టాదశ పురాణాలను కూడా రచించినట్టు చెబుతారు. అయితే, కొన్ని పురాణాలను రచించిన వ్యాసుడి శిష్యులు కొందరు, గురువు మీది భక్తితో ఆయన పేరే పెట్టుకుని వుండవచ్చని పండితులు అభిప్రాయ పడుతున్నారు.

వ్యాసుడి కాలం ఇదీ అని ఇతమిత్థంగా చెప్పలేము, కాని ఆయన ఐదువేలా ఐదువందల సంవత్సరాలకు పూర్వం వాడని పలువురు పండి తులు భావిస్తున్నారు.



# మీకు తెలుసా?

1. ఎలిఫెంటా గుహలు ఎక్కడ ఉన్నాయి?
2. 15వ శతాబ్దానికి చెందిన ఒక భారతీయ మహనీయుణ్ణి, హిందువులూ, ముస్లింలూ తమ వారుగా భావిస్తారు. ఆయన ఎవరు?
3. మనదేశంలో మొట్టమొదటి మహిళా డాక్టర్ ఎవరు?
4. మనదేశంలో వైమానిక దళం ఎప్పుడు ఏర్పడింది?
5. మనదేశంలో తపాలాబిళ్ళ ఎప్పుడు ప్రవేశ పెట్టబడింది?
6. మనదేశంలోని మొట్టమొదటి నౌకా నిర్మాణ సంస్థ ఏది? దానిని ఎప్పుడు ఎవరు స్థాపించారు?
7. 'కామన్వెల్త్ డే' ఎప్పుడు జరుపుకుంటారు?
8. ఏసుక్రీస్తును శిలువ వేసినప్పుడు, ఆయన తన తల్లి మేరీ సంరక్షణను చూసుకోమని ఒక శిష్యుణ్ణి కోరాడు. ఆ శిష్యుడు ఎవరు?
9. 'పాత నిబంధనల'లో నోవా తాతగా ఎవరిని పేర్కొన్నారు?
10. క్రికెట్‌ను జాతీయక్రీడగా గల దేశం ఏది?
11. విమానాన్ని కనిపెట్టిన 'రైట్ సోదరుల' వృత్తి ఏది?
12. 'ఎగిరే పళ్ళాల'ను మొట్టమొదట ఎప్పుడు చూసినట్టు చెప్పారు?
13. 'ది లేడీ విత్ ల్యాంప్' అని ప్రసిద్ధిగాంచిన వారెవరు?
14. ఐక్యరాజ్య సమితి మొట్టమొదటి ప్రధాన కార్యదర్శి ఎవరు?
15. 'అట్లాంటిస్'ను తన గ్రంథంలో వర్ణించిన రచయిత ఎవరు?

## సమాధానాలు

1. బొంబాయిలో.
2. కబీరు.
3. డా॥ ఆనందిబాయ్ జోషి (1886).
4. 1932 అక్టోబర్ 8.
5. 1852వ సం॥లో.
6. విశాఖపట్నంలోని హిందూస్థాన్ షిప్‌యార్డ్. 1941వ సం॥లో బొంబాయికి చెందిన సింధియా స్టీమ్ నేవిగేషన్ కంపెనీ.
7. మే 24.
8. జాన్.
9. మెథూస్‌లా.
10. ఆస్ట్రేలియా.
11. సైకిలు షాపు నడిపేవారు.
12. 1947 జూన్ 24.
13. ఫ్లారెన్స్ నైటింగేల్.
14. డ్యాగ్ హామర్స్క్ జోల్డ్.
15. ప్లూటో.



# వెనుకబడిన శిష్యుడు

పరబ్రహ్మస్వామి సకల శాస్త్ర పారంగతుడు, మహామహిమాన్వితుడు. అరణ్యంలో వుండి తపస్సు చేసుకుంటున్నా ఏటా కొందరు శిష్యులను స్వీకరించి వారికి తగినంత జ్ఞానాన్ని పంచిపెడతాడు. ఏ శిష్యుణ్ణీ ఏడాదికి మించి ఆశ్రమంలో వుంచుకోడు.

శివపురానికి చెందిన గణనాథుడు సంవత్సరం పాటు భక్తిశ్రద్ధలతో పరబ్రహ్మస్వామిని సేవించి చాలా జ్ఞానం సంపాదించాడు. ఇంతకాలంగా తనకు తెలియని విశేషాలు ఎన్నో వున్నాయని వాడు అబ్బురపడితే, పరబ్రహ్మస్వామి, "నాయనా! నాకు తెలిసిన దాంట్లో లక్షోవంతు మీకు చెప్పాను. ఇక నాకు తెలిసినదంటారా — జ్ఞాన సముద్రంలోని ఒకే ఒక నీటిబొట్టు!" అనేవాడు.

ఆ ఏడాది గణనాథుడితో కలిపి పరబ్రహ్మస్వామి వద్ద మొత్తం పదిమంది శిష్యులున్నారు. స్వామి ఆరంభంలో అందరికీ కలిపి పాఠాలు చెప్పేవాడు. తర్వాత వారిని రెండు జట్లుగా విడదీశాడు. సంవత్సరం మధ్యలో మళ్ళీ అందర్నీ కలిపేశాడు. కానీ కుశుడనే వాడినొక్కడినీ వేరు చేశాడు.

పరబ్రహ్మస్వామి, కుశుడి పట్ల ప్రత్యేక శ్రద్ధ చూపిస్తున్నాడని, మిగతా శిష్యులందరికీ అర్థమైపోయింది. తొమ్మండుగురు శిష్యులకూ కలిపి రోజుకు నాలుగు గంటలు పాఠాలు చెబితే, కుశుడొక్కడికీ ఎనిమిది గంటలకు తక్కువ కాకుండా చెప్పేవాడు. గురువు చూపే ఈ పక్షపాత ధోరణిని భరించలేక, ఒకరోజున మిగతా శిష్యులందరూ ఆయనను కలుసుకుని తమ తప్పేమిటని అడిగారు.

"శిష్యుల సామర్థ్యాన్ని బట్టి వారికి రోజుకెంతసేపు పాఠం చెప్పాలో నేను నిర్ణయిస్తాను. మీరు కూడా పాఠాలను కుశుడి అంత తొందరగా ఆకళింపు చేసుకోండి. మిమ్మల్ని కూడా వాడితో కలుపుతాను," అన్నాడు స్వామి.

"వసుంధర"



చేసేది లేక శిష్యులూరుకున్నారు. అలా ఏడాది గడిచిపోయింది. వాళ్ళు వెళ్ళి పోయే రోజు వచ్చింది.

పరబ్రహ్మస్వామి వాళ్ళ ముందు పదివిత్తనాలను పెట్టాడు. చూడడానికవన్నీ ఒక్కలాగే వున్నాయి. ఆయన గణనాధుడితో, ఆవిత్తనాలను చేతిలోకి తీసుకుని బాగా కలపమన్నాడు. తర్వాత వాటిని శిష్యులందరికీ తలా ఒకటీ చొప్పున వాడిచేతనే పంపకం చేయించి, "ఈ విత్తనాల పంపకం గణనాధుడు చేశాడు. ఇందులో నేనేమీ పక్షపాతబుద్ధి చూపలేదని మీరు నమ్ముతున్నారు గదా!" అన్నాడాయన.

శిష్యులందరూ తలలూపి, ఆయనింకా ఏమి చెబుతాడోనని కుతూహలంగా చూడసాగారు. అప్పుడు పరబ్రహ్మస్వామి వాళ్ళతో, "మీరు ఇళ్ళకు వెళ్ళాక, ఈ విత్తనాలను పెరట్లో పాతిపెట్టండి. నెలరోజుల్లోగా మొలక లేస్తుంది. మూడు మాసాలలో మొక్క అవుతుంది. ఆరు మాసాలలో పువ్వు పూస్తుంది. ఈ పది విత్తనాలలోనూ నీలంరంగు పువ్వు పూయించే విత్తనం ఒక్కటే వుంది. ఎవరింట నీలంరంగు పువ్వు పూస్తుందో, వాళ్ళా పువ్వును నాకు గురుదక్షిణగా తెచ్చి ఇవ్వాలి. ఎవరు నాకు గురుదక్షిణ ఇస్తారో వారికి నేను చెప్పిన విద్య కలకాలం గుర్తుండి పోతుంది. అలాంటి అవకాశం మీలో ఒక్కరికే లభిస్తుంది. మిగతా వారు నిరంతర అభ్యాసంతో జ్ఞానాన్ని గుర్తు చేసుకుంటూండాలి," అన్నాడు.

గణనాధుడు అసంతృప్తిగా, "గురువర్యా! తమకు ఇంతకు మించిన గురుదక్షిణమేమివ్వగలం. ఈ పువ్వుతో సరిపెట్టుకోవడమెందుకు?" అన్నాడు.

"వెర్రివాడా! ఆ పువ్వును నమిలిమింగితే వానలెప్పుడు పడతాయో నెల రోజులుముందుగా తెలుసుకోగల శక్తి వస్తుంది. ఆ శక్తి నాకు లేదు. ఈ పువ్వు లెవరికైనా మామూలుగా పనిచేస్తాయి కానీ, నాకు మాత్రం శిష్యుల ద్వారానే పనిచేస్తాయని, నా గురువు శాసించాడు. అందుకోసమే మీ సాయం తీసుకుంటున్నాను," అని వివరించాడు పరబ్రహ్మస్వామి.

శిష్యులందరూ వారి వారి గ్రామాలకు ప్రయాణమై వెళ్ళారు.

గణనాథుడు శివపురం చేరుకుని ఇంటికి వెళ్ళి పెరట్లో ఒక చోట విత్తనాన్ని పాతిపెట్టాడు. వాడు పరబ్రహ్మస్వామికి శిష్యరికంచేసి వచ్చాడని తెలిసి, ఊరి పెద్దలు కొందరు చూడ్డానికి వచ్చారు. వాడి చదువు గురించి అడిగి తెలుసుకున్నారు.

అంతా విన్నాక, "ఈ చదువు గురించి మాకేం తెలియదు. కానీ మన ఊళ్ళో ఏ క్షణంలో వాన వస్తుందో తెలియదు. అందువల్ల పంటలు సరిగ్గా పండించుకోలేక పోతున్నాం. వాన ఎప్పుడు వస్తుందో కాస్త ముందుగా చెప్పగలిగావా, ఊరంతా నిన్ను అందలం ఎక్కిస్తుంది. నిన్ను దేవుడిలా కొలుస్తుంది," అన్నాడొక పెద్దమనిషి.



ఈ మాటలు వినగానే గణనాథుడికి రకరకాల ఆలోచనలు వచ్చాయి. అంతవరకూ వాడికి గురు విచ్చిన విత్తనం తృప్తికరంగా లేదు. ఇప్పుడు తన పెరట్లో నీలం పువ్వు పూస్తే తిరిగి ఆయన వద్దకు వెళ్ళాలని బెంగ పట్టుకున్నది. తను చదివిన చదువు గురుదక్షిణ ఇవ్వకపోయినా, నీలం పువ్వును నమిలిమింగితే కలకాలం గుర్తుండిపోతుంది. గురువు నేర్పిన జ్ఞానం కంటే,వానల గురించి తెలుసుకునే అద్భుత శక్తి వల్ల, తను కీర్తిమంతుడే కాక, గొప్ప సంపన్నుడవుతాడు!

ఆనాటి నుంచీ గణనాథుడు ప్రతి రోజూ గుడికి వెళ్ళేవాడు. భక్తి శ్రద్ధలతో దేవుణ్ణి పూజించే వాడు. గురువు ఇచ్చిన విత్తనం తన పెరట్లో మొలకెత్తి మొక్కగా మారి నీలం పువ్వు పూయాలన్న దొక్కటే వాడికోరిక.

రోజులు గడుస్తున్నాయి. విత్తనం మొలకెత్తింది. మొక్కగా మారింది. మొగ్గ తొడిగింది. ఒక రోజున మొగ్గ పువ్వయింది. ఆశ్చర్యంగా ఆ పువ్వులో ఎక్కడా తెలుపు రంగు ఛాయలు లేవు. పూర్తి నీలం రంగులో వున్నదా పువ్వు.

గణనాథుడి సంతోషానికి పట్టపగ్గాలు లేవు. వెంటనే వాడా పువ్వును కోశాడు. నోట్లో వేసుకోబోతూ తప్పుచేస్తున్నానేమో అని తటపటాయించాడు. అది గురుదక్షిణగా ఇవ్వవలసిన పువ్వు మరి!

"గురువు పక్షపాత బుద్ధితో కుశుడికి చదువెక్కువ చెప్పాడు. పైన దేవుడున్నాడు!



మన ఊళ్ళో పెద్దవాన కురవబోతున్నది," అన్నాడు.

అప్పటికి ఎండలు బాగా కాస్తున్నాయి. అలాంటి సమయంలో ఏనాడూ ఊళ్ళో వానలు కురిసింది లేదు. అందువల్ల, గ్రామాధికారి, గణనాథుడి మాటలు నమ్మలేదు. అయితే, ఊళ్ళో అందరికీ విషయం చెప్పాడు. కొందరు నమ్మారు. ఎక్కువ మంది వెటకారం చేశారు.

కానీ సరిగ్గా గణనాథుడు చెప్పిన ప్రకారం శివపురంలో వానపడింది. అప్పటి నుంచీ వాడి దశ మారిపోయింది. రెండు మూడు సంవత్సరాల్లో వాడా ఊళ్ళోకల్లా భాగ్యవంతుడయ్యాడు. పొరుగూళ్ళ నుంచి కూడా వానల గురించి తెలుసుకునేందుకు జనం వచ్చేవారు.

ఇలా వుండగా, ఒక ఏడాది ఆ ప్రాంతమంతటా క్షామం వచ్చింది. వరసగా రెండు సంవత్సరాల పాటు సరైన వానలు లేవు. ఒక నెలలోగా వానలు పడవని గణనాథుడు అందరికీ చెప్పేశాడు.

ఆ సమయంలో, పొరుగూరు నుంచి ఒక వ్యక్తి శివపురానికి వచ్చి గ్రామాధికారిని కలుసుకున్నాడు, అప్పుడు గణనాథుడూ, కొందరు ఊరిపెద్దలూ గ్రామాధికారితో మాట్లాడుతున్నారు.

పొరుగూరి వాణ్ణి చూసిన గణనాథుడు, వాడు తన కోసం వచ్చాడనుకుని, "నేను

అందుకే నీలంరంగు పువ్వు కుశుడి పెరట్లో కాక, నాపెరట్లోపూసింది. విత్తనంగురువిచ్చి నా పువ్వు దేవుడి దయవల్ల పూసింది! కాబట్టి నేనీ పువ్వును తిని అద్భుత శక్తిని సాధించడంలో తప్పులేదు," అని మనస్సును సరిపెట్టుకుని, గణనాథుడా పువ్వును తిన్నాడు.

మరుక్షణమే ఆశ్చర్యంగా వాడి మనస్సులో వానల గురించి సమాచారం మెదలసాగింది. రెండే రెండు రోజుల్లో ఊళ్ళో పెద్ద వాన కురవబోతున్నట్టు వాడికి తెలిసిపోయి, వెంటనే గ్రామాధికారి వద్దకు పరిగెత్తి వెళ్ళి, "అయ్యా! మనగ్రామస్థులకోసంనాజ్ఞానాన్నంతావినియోగించి, వానలెప్పుడు వచ్చేదీ తెలుసుకునే శక్తిని సంపాదించాను. రెండు రోజుల్లో

మీ ఊరు వచ్చి ఏంలాభం?.క్షామం దేశమంతటా వచ్చింది. ఇక్కడ పడని వానలు మీ ఊళ్ళో మాత్రం పడతాయా!" అన్నాడు.

దానికి పొరుగూరు వాడు వినయంగా, "అయ్యా! వానలెప్పుడు వచ్చేదీ గతంలో తమరు చెప్పగలిగారు కానీ, ఈ పర్యాయం తమ అంచనా తప్పింది.మా ఊరికొక మహానుభావుడు వచ్చాడు. ఆయన రెండు రోజుల్లో వానలు పడతాయనిఅన్నాడు.అలాగే పడ్డాయి. ఆయనను తమ ఊరుక్కూడా ఆహ్వానించండి," అన్నాడు.

ఇది వినగానే గణనాధుడి ముఖం చిన్నబోయింది.ఆతర్వాత వాడెంతచెప్పినావినకుండా, ఊరివాళ్ళు ఆ మహానుభావుణ్ణి ఆహ్వానించారు. అతడు వచ్చి, మర్నాడే వానపడుతుందన్నాడు. అలాగే జరిగింది.

గణనాధుడాశ్చర్యపడి, ఆ వచ్చిన వాడు కుశుడని తెలుసుకుని, అతడికి జరిగింది చెప్పి, "ఈనాటి వరకూ నా జోస్యం తప్పలేదు. నువ్వు చేసిన దాంట్లో గురువుగారి మాయ ఏదో వున్నదనిపిస్తోంది!" అన్నాడు.

కుశుడు నవ్వి, "గురువుగారు ఏ మాయా చేయలేదు. ఆయన మనలో ప్రతి ఒక్కరికీ నీలం పువ్వు పూసే మొక్క విత్తనాన్నే ఇచ్చి, మన గురుభక్తిని పరీక్షించారు. నేనొక్కడిని తప్ప, ఆ పువ్వు తీసుకుని ఆయన దగ్గరకు ఎవ్వరూ వెళ్ళలేదు. నా భక్తికి మెచ్చి ఆయన అకాలవర్షం కురిపించే శక్తిని అదనంగా ప్రసాదించారు. అంతేకాక, పువ్వును కూడా నమిలి తినమని ఆయన చెప్పారు. నా శక్తిని దుర్వినియోగం చేయవద్దని మరీమరీ హెచ్చరించారు. అందువల్ల నేను, నాకు వానలు కురిపించగల శక్తి వున్నదని ఎవరికీ చెప్పకుండా ప్రజలకు సాయపడుతున్నాను," అన్నాడు.

అది విన్న గణనాధుడు ఆలోచనలో పడ్డాడు. వాడికి అర్హతను బట్టి మాత్రమే జ్ఞానం లభిస్తుందన్న సత్యం తెలిసి వచ్చింది. అందరికీ సమానావకాశమున్నా చదువు, గురుభక్తి విషయాల్లో కుశుడికున్న ఏకాగ్రత లేకనే, జ్ఞానసముపార్జనలో మిగతా శిష్యులు వెనకపడ్డారని వాడు గ్రహించాడు.






# యోగ్యతాపరీక్ష

కళింగదేశపు వృద్ధమంత్రి హఠాత్తుగా మరణించడంతో, రాజు కీర్తివర్ధనుడికి పెద్ద సమస్య ఎదురైంది. కళింగదేశం సువిశాలమైందేకాక సుసంపన్నమయింది కావడంతో, దానిని ఏదో విధంగా ఆక్రమించుకోవాలని ఇరుగు పొరుగు రాజ్యాలు తహతహలాడుతుండేవి. అటువంటి రాజ్యాన్ని కాపాడడానికి బలవంతుడైన రాజుకు తోడుగా యుక్తిపరుడూ, రాజ్యతంత్రం ఎరిగినవాడూ అయిన మంత్రి వుండడం ఎంతో అవసరం!

చనిపోయిన మహామంత్రి అన్నిటా ప్రతిభావంతుడే గాక ఎంతో అనుభవజ్ఞుడు. ఆయనతో తులతూగగల వ్యక్తి ఎవ్వరూ కీర్తివర్ధనుడికి ఆస్థానంలో కనిపించలేదు. అందువల్ల, కాబోయే మంత్రి ఆస్థానంలోని వ్యక్తే అయి వుండవలసిన పనిలేదని ఆయన భావించాడు.

కీర్తివర్ధనుడు బాగా ఆలోచించి దేశమంతటా ఒక ప్రకటన చేయించాడు. అదేమంటే, "కళింగదేశపు మహామంత్రి పదవికి తెలివితేటలు, ప్రజ్ఞాపాటవాలు పుష్కలంగా వున్న వ్యక్తి కావాలి. ఐతే, ప్రతిఒక్కరూ పదవికోసం ఆశపడి, యోగ్యతాపరీక్షను నిర్వహించడానికి మాకు ఇబ్బంది కలిగించవద్దని సలహా. చూడగానే — ఇతడే మహామంత్రి అయివుంటాడని అనిపించేటంత తేజస్సు, కళ ముఖంలో ఉట్టిపడే వ్యక్తులు మాత్రమే యోగ్యతా పరీక్షకు రావలసి వుంటుంది."

మహామంత్రి కానున్న వ్యక్తికి తెలివితేటలు, మంచి ప్రజ్ఞాపాటవాలు వుండడం అవసరమే! కాని ముఖంలో కళ, తేజస్సు వుండాలన్న నిబంధన చాలా మంది పౌరులకు నచ్చలేదు. అయితే, అది తప్పని రాజుకు చెప్పే ధైర్యం, చొరవ రాజ్యంలో ఎవరికీ లేకపోయింది.

కళింగదేశంలో ప్రతిభావంతులకు కొదవే మీలేదు. కాని, రాజుగారు ఆశించిన కళ, తేజస్సు తమ ముఖంలో లేకపోవడంతో, చాలా

బి. రఘురామరాజు

మంది ప్రతిభావంతులు మంత్రి పదవి కోసం ఆయనను దర్శించడానికి వెనుకాడారు. తమ ముఖంలో రాజుగారు చెప్పిన లక్షణాలు వున్నా యనుకున్న వాళ్ళు, ఆయన దర్శనం చేసుకు న్నారుకాని, ఆయన అంచనా మేరకు వాళ్ళలో తెలివితేటలు లేకపోవడంతో ఇంటిదారి పట్టారు.

ఆదేశంలోని రాజధానీనగరంలో నివసించే శ్రీధరుడు చురుకైనవాడు, మంచి తెలివి తేటలు కలవాడు. శాస్త్రాలను కాచి వడపోయ డమేకాకుండా, రాజ్యపాలనా విధానం గురించి మంచి అవగాహన అతడికుండేది. రాజుగారు నిర్వహించే యోగ్యతాపరీక్షలో విజయం సాధించగలనన్న నమ్మకం అతడి కున్నది. కాని, వచ్చిన చిక్కల్లా అతడికి అందమైన ముఖం లేకపోవడం. అతడి ఒంటి ఛాయ కారు నలుపు. పైగా ముఖం నిండా మశూచి సోకిన గుర్తులు.

ఏది ఏమైనా, మంత్రి పదవి కోసం ప్రయ త్నంచేయాలనుకున్నాడు శ్రీధరుడు. అందు కొక పథకం ఆలోచించి, రాజుగారు ఉదయం ఉద్యానంలో తిరిగే వేళకక్కడికి వెళ్ళాడు.

ఆ సమయంలో ద్వారం దగ్గర వుండే కాపలా భటుడు, దూరంగా మరెవరితోనో మాట్లాడుతున్నాడు. శ్రీధరుడు వాడు చూడ కుండా ఉద్యానంలో ప్రవేశించాడు. రాజు గారు తలమీద కిరీటం, ఒంటి మీద నగలు, ఖరీదైన దుస్తులు లేకుండా తోటలో పచార్లు చేస్తున్నాడు.

శ్రీధరుడు ఆయన దగ్గరకు వెళ్ళకుండా, తోటలో ఒక మూల చెట్లకు నీళ్ళు పోస్తున్న



తోటమాలి దగ్గరకు వెళ్ళి, "మహారాజా! నా తల్లిదండ్రులుమరణించడంతో, ఏఉద్యోగమూ లేని నాకు పొట్టగడవడం కష్టంగా వుంది. దయతో ఏదైనా ఉద్యోగం ఇప్పించండి," అంటూ ప్రాధేయపడసాగాడు. ఇది చూసిన రాజు, శ్రీధరుడి దగ్గరకు చరచరా వచ్చి, "ఏ దేశం నీది?" అని అడిగాడు కోపంగా.

"ఈ కళింగదేశమే!" అని జవాబిచ్చాడు శ్రీధరుడు.

"ఇదే దేశంలో వుంటూ, ఈ దేశానికి రాజెవ్వరో కూడా తెలియదా నీకు? ఈ దేశానికి రాజును నేను. నువ్వు ప్రాధేయపడుతున్నది, నా తోటమాలిని. తెలుసా?" అన్నాడు రాజు.

శ్రీధరుడు, రాజుకు తలవంచి నమస్కరించి, "క్షమించండి, మహారాజా! నేనీనాటి వరకూ తమరిని చూసి వుండక పోవడంతో, ఈ పొరబాటు జరిగింది. తలమీద కిరీటం, ఒంటి మీద నగలు లేకపోవడంతో తమరిని రాజుగా పోల్చుకోలేకపోయాను. ఎత్తూ, లావూ, అందుకు తగ్గ శరీర దారుఢ్యం, మెలి తిరిగిన మీసం, కాంతివంతమైన కళ్ళు వున్న ఈ తోటమాలిని చూసి రాజుగారనుకుని భ్రమపడ్డాను. అంతేకాని, తమరిని అగౌరవపరచాలని నా ఉద్దేశం కాదు," అన్నాడు.

ఇది వింటూనే రాజుకు, తను కొద్ది రోజులకు ముందు మంత్రిపదవికోసం రాజ్యమంతటా చేయించిన ప్రకటన గుర్తుకొచ్చింది. బాధ్యతాయుతమైన మంత్రిపదవికి తెలివితేటలే తప్ప, రూపురేఖలు కాదన్న వాస్తవాన్ని అర్థం చేసుకున్న రాజు నవ్వుతూ, "నువ్వు, మంత్రిపదవి కోసం నేను చేసిన ప్రకటనలోని లోపాన్ని చాలా చక్కగా ఎత్తిచూపావు. నీలాంటి బుద్ధిశాలికి ఏదో మామూలు ఉద్యోగం ఎందుకు? ఇప్పుడు రూపురేఖల నిబంధన వదిలి వేశాను కనక, రేపు నేను నిర్వహించబోయే యోగ్యతాపరీక్షల్లో పాల్గొని, ఆ మహామంత్రి పదవినే సొంతం చేసుకోగలవేమో ప్రయత్నించు," అన్నాడు.

మర్నాడు జరిగిన యోగ్యతాపరీక్షలలో విజయం సాధించిన శ్రీధరుడు, మంత్రి పదవిని చేపట్టి, రాజుకు చక్కని సలహాలు ఇస్తూ సమర్థుడైన మంత్రిగా పేరు తెచ్చుకున్నాడు.





# మహాభారతం

భీముడు గంగ మడుగులోపడి పాతాళానికి దిగిపోవడం తెలియని ధర్మరాజు అతడి కోసం అంతటా వెతికాడు. భీముడి జాడ లేదు. దుర్యోధనుణ్ణి అడిగితే, "అప్పుడే నగరానికి వెళ్ళిపోయాడు," అన్నాడు. ధర్మరాజు వెంటనే నగరానికి తిరిగి వెళ్ళి, కుంతిని కలుసుకుని, భీముడు వచ్చాడా అని అడిగితే ఆమె రాలేదన్నది.

"వాడు గంగా తీరంలో ఒకచోట పడుకుని నిద్రపోవటం చూశాను. మళ్ళీ చూస్తే అక్కడ లేడు. అంతటా వెతికాను. ఎక్కడా కనబడడు. నా ప్రయాస అంతా వృధా. ఏమై పోయాడో?" అన్నాడు ధర్మరాజు విచారంగా.

కుంతికి దుఃఖం వచ్చింది. "నువ్వూ, నీ తమ్ములూ నాలుగు దిక్కులా వాడికోసం వెతకండి, నాయనా," అని ఆమె విదురుణ్ణి పిలిపించి, "మిగిలినవాళ్ళతో ప్రమాణకోటి స్థలానికి వెళ్ళిన భీముడు తిరిగి రాలేదు. ధర్మరాజు గంగా తీరమంతటా ఎంత వెతికినా వాడు కనిపించ లేదుట. దుర్యోధనుడికి వాడంటే అమిత ఈర్ష్య; వాడి ప్రాణాలు తీశాడో ఏమోనని నాకు భయంగా ఉన్నది," అన్నది.

"నాతో అంటే అన్నావు, ఈ మాట మరెక్కడా అనకు. దుర్యోధనుడు పరమ దుర్మార్గుడు. ఈ మాట వింటే వాడు నీ మిగిలిన కొడుకులను బతకనివ్వడు. ఆ విషయం ఆలోచించు. అయినా భీముడి ప్రాణాలకేమీ భయం ఉండదులే. నీ కొడుకులందరూ దీర్ఘాయువులు," అని విదురుడు కుంతిని

7. ద్రోణుడి కథ



భీముణ్ణి తన భుజాల మీద ప్రమాణకోటి స్థలంలో వున్న ఒక వనానికి మోసుకువచ్చాడు. భీముడు తనను సాగనంప వచ్చిన నాగుల వద్ద ఆప్యాయంతో సెలవు పుచ్చుకుని, హస్తినాపురం చేరి, తల్లికీ, అన్నకూ నమస్కరించి, తమ్ముళ్ళను ఆనందంగా కౌగిలించుకున్నాడు.

అతని రాకతో అందరి విచారమూ తొలగిపోయింది.

భీముడు తల్లితో తనను దుర్యోధనుడు చంపాలని విషాహారం పెట్టటమూ, కాళ్ళు చేతులు కట్టి నదిలోకి తొయ్యటమూ, నాగలోకంలో తన అనుభవాలూ అన్నీ వివరంగా చెప్పాడు. దుర్యోధనుడి దుర్మార్గం తలుచుకుని ఆమె బాధగా నిట్టూర్చింది. అయినా తన కొడుకు క్షేమంగా తిరిగి వచ్చినందుకు ఎంతో సంతోషించింది.

కౌరవ పాండవ కుమారులు కృపాచార్యుల వద్ద విలువిద్య నేర్చుకునేటట్టు భీష్ముడు ఏర్పాటుచేశాడు. కుర్రవాళ్ళు కొంతకాలం కృపాచార్యుల వద్ద శిక్షణ పొందిన పిమ్మట భీష్ముడు వారికి గురువుగా, హస్తినాపురానికి వచ్చిన ద్రోణాచార్యుణ్ణి ఏర్పాటుచేశాడు.

అ ద్రోణుడు భరద్వాజుడనే ఋషికి కొడుకు. అతను పెరిగి పెద్దవాడై వేద వేదాంగాలను పూర్తిగా చదివి, అస్త్రవిద్యలు నేర్చుకోవటానికి అగ్నివేశుడనే గురువువద్ద శిష్యుడుగా చేరి, అగ్నేయాది అస్త్రాలను సంపాదించాడు.

ఊరడించి, ధైర్యం చెప్పి అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

అక్కడ నాగలోకంలో భీముడు ఎనిమిది రోజులుహాయిగానిద్రపోయి,మేలుకున్నాడు. అప్పుడు అక్కడ చేరిన నాగులు అతనితో, "నువ్వు తాగిన దివ్యరసం బాగా జీర్ణమయింది. నీకిక వెయ్యి ఏనుగుల బలం ఉన్నది. గంగలో స్నానం చేసి, నీ తల్లినీ, తోబుట్టువులనూ చేరుకో," అన్నారు.

వాళ్ళు భీముడి చేత గంగలో స్నానం చేయించి, కట్టుకోవటానికి పట్టుబట్టలిచ్చి, అనేక ఓషధులు చేర్చి తయారుచేసిన పరమాన్నం పెట్టి, అనేక నగలతో అందంగా అలంకరించారు. తరవాత ఒక నాగుడు

అగ్నివేశుడి వద్దనే మరొక శిష్యుడు కూడా వుండేవాడు. అతను పాంచాల రాజైన వృషతుడి కొడుకు, ద్రుపదుడనేవాడు. ఇద్దరూ ఒక గురువు దగ్గిర శిష్యులు కావటంచేత ఇద్దరికీ మంచి స్నేహం కుదిరింది.

కొంత కాలానికి పాంచాల రాజైన వృషతుడు చనిపోగా, ద్రుపదుడు పాంచాల దేశానికి రాజ్యాభిషేకం చేసుకున్నాడు. ద్రోణుడి తండ్రి అయిన భరద్వాజుడు కూడా పోయాడు. తరవాత ద్రోణుడు కృపాచార్యుడి చెల్లెలయిన కృపి అనే ఆమెను పెళ్ళాడాడు. వారిద్దరికీ అశ్వత్థామ అనే కొడుకు కలిగాడు.

ద్రోణుడు సంసారం ఈదే ప్రయత్నంలో సంపాదన మార్గం చూసుకోవలసి వచ్చింది. పరశురాముడు బ్రాహ్మణులకు అడిగినంతగా దానాలు చేస్తున్నాడని విని ద్రోణుడు ఆశతో అక్కడికి వెళ్ళాడు.

పరశురాముడు ద్రోణుడితో, "నాయనా, నాకున్నదంతా బ్రాహ్మణులకు దానంగా ఇచ్చేశాను. భూమి అంతా కశ్యపుడికిచ్చాను. ఇక నావద్ద అస్త్రాలు తప్ప మరేమీ లేవు," అన్నాడు.

"ఆ అస్త్రాలనే నాకు దయచేయించండి," అన్నాడు ద్రోణుడు.

పరశురాముడు ద్రోణుడికి తనవద్ద ఉన్న అస్త్రాలన్నీ ఇచ్చేస్తూ, వాటిని ఎలా ప్రయోగించాలో, ఎలా ఉపసంహరించాలో శాస్త్రోక్తంగా చెప్పాడు.

తరవాత ద్రోణుడు, తన పూర్వ స్నేహితుడైన ద్రుపదుడు తనకు సహాయపడతాడనే





ఉద్దేశ్యంతో, అతని వద్దకు వెళ్ళాడు. రాజయ్యాక ద్రుపదుడికి కళ్ళు నెత్తికొచ్చాయి. అతను ద్రోణుణ్ణి చూసి హేళనగా నవ్వి, "నువ్వెవరో నే నెరగను. వెళ్ళు, వెళ్ళు," అన్నాడు.

అవమానం పొందిన ద్రోణుడు హస్తినాపురానికి తిరిగి వచ్చి, తన బావమరిది చాటున అజ్ఞాతంగా ఉంటూ వచ్చాడు. ఇలా ఉండగా ఒకనాడు కౌరవ కుమారులు నగరం వెలుపల బంతి ఆడుతూండగా బంతి ఒక బావిలో పడింది. దానిని పైకి తీయటం వారికి సాధ్యం కాలేదు. ఆ సమయంలో ద్రోణుడు వాహ్యాళికి అటుగా వచ్చాడు. కుర్రవాళ్ళు అతని చుట్టూ మూగి, ఎలాగైనా బావిలో బంతిని పైకి తీసి పెట్టమని బతిమాలారు.

"అబ్బాయిలూ, మీరందరూ భరత వంశాంకురాలు, అందులోనూ కృపాచార్యుడి శిష్యులు; బావిలో నుంచి బంతిని తీయలేక పోతున్నారా? ఈ నా ఉంగరాన్ని బావిలో వేసి, దాన్నీ, మీ బంతినీ కూడా తీస్తాను, చూసుకోండి," అంటూ ద్రోణుడు బావిలోకి తొంగి చూస్తూ చిరునవ్వు నవ్వి తన ఉంగరాన్ని బావిలో వేశాడు.

ధర్మరాజు ద్రోణుడితో, "ముసలిబ్రాహ్మడా, ఈ పని చేశావంటే కృపాచార్యులుగారు నీకు యావజ్జీవం భోజనం ఏర్పాటు చేస్తాడు," అన్నాడు.

"చూస్తూ ఉండండి," అంటూ ద్రోణుడు ధనుర్బాణాలు తీసుకుని, ఒక బాణాన్ని బంతిలో ఇరుక్కునేటట్టు కొట్టాడు; తరవాత వరసగా బాణానికి బాణం తగులుకునేటట్టు చేసి, ఆ బాణాల తాడుతో బంతిని పైకి తీశాడు. పిల్లలందరూ ఆశ్చర్యపోయి, "ఉంగరాన్ని కూడా తియ్యి," అన్నారు ఉత్సాహంగా.

ద్రోణుడొక బాణాన్ని మంత్రించి కొట్టి ఉంగరాన్ని తగులుకునేటట్టు చేశాడు. తరవాత, బంతిని లాగినట్టే ఉంగరాన్ని కూడా పైకి లాగాడు.

పిల్లలందరూ ఈ అద్భుతం చూసి దిగ్భ్రమ చెంది, ఒక్కసారిగా ఆయనకు నమస్కారాలు



చేసి, "స్వామీ, ఇటువంటి శక్తి మేమెక్కడా చూడలేదు. మీరెవరు? మావల్ల మీకేం ఉపకారం కావాలి?" అని అడిగారు.

"మీరు పిల్లలు. నా గొడవ మీకెందుకు? ఈ సంగతి మీ తాతగారైన భీష్ముడికి చెప్పండి. నా సంగతి ఆయనే విచారిస్తాడు," అన్నాడు ద్రోణుడు.

పిల్లల ద్వారా భీష్ముడు సంగతంతా తెలుసుకుని, ద్రోణుణ్ణి సాదరంగా నగరానికి ఆహ్వానించి, "మీరు హస్తినాపురానికి రావటానికి కారణమేమిటి?" అని అడిగాడు.

ద్రోణుడు తన పుట్టుపూర్వోత్తరాలు చెప్పి, "మా తండ్రి నన్ను కృపాచార్యుడి చెల్లెలిని పెళ్ళాడమని ఆదేశించి చనిపోయాడు. నేనలాగే చేసి అశ్వత్థామను కన్నాను. తన తోటివాళ్ళు ఆవుపాలు తాగుతుంటే నా కొడుకు తనకు కూడా ఆవు పాలు కావాలని ఏడ్చాడు. ఆవును సంపాదించటం నాకు సాధ్యం కాక, నీటిలో పిండి కలిపి, అవే ఆవుపాలని ఇస్తే, నా కొడుకు సంతోషంతో తాగుతూ వచ్చాడు. మా ఆశ్రమంలో వాళ్ళు నా బీద స్థితిని చూసి నిందించారు. నాకు అప్పుడు నా సహపాఠి అయిన ద్రుపదుడు గుర్తు వచ్చాడు. చిన్నతనంలో అతను తనకు రాజ్యం వస్తే దాన్ని నాకిస్తాననేవాడు. అతని సహాయం ఆశించి పాంచాలదేశం వెళ్ళి, అతనికి మా పాత స్నేహం గుర్తుచేశాను. అప్పుడు రాజ్య మదాంధుడై అతను, రాజైన తనకూ, పేద బ్రాహ్మడినైన నాకూ స్నేహమేమిటన్నాడు; నన్ను ఎరగనే ఎరగనన్నాడు; కావలిస్తే ఒక పూట భోజనం పెడతానన్నాడు. నాకు మండిపోయింది. భార్యనూ, కొడుకునూ వెంటబెట్టుకుని ఈ కురు దేశం వచ్చాను. మీరు పిలవనంపగా ఇటు వచ్చాను. ఏమిటి తమ ఆజ్ఞ?" అన్నాడు.

"మీరు కురుదేశం రావటం మా పిల్లల సుకృతం. మీకు కావలసిన సుఖాలన్నీ అమర్చుతాను. మిమ్మల్నే రాజుగా భావించి, మీ ఆజ్ఞలు శిరసా వహిస్తాము," అని భీష్ముడు కొద్ది రోజుల అనంతరం ఒకనాడు కౌరవ, పాండవ కుమారులందరినీ ద్రోణుడికి విద్య నేర్పమని శిష్యులుగా సమర్పించాడు.

ద్రోణుడు కుర్రవాళ్ళనందరినీ చేర్చి, "మీకు నేను విలువిద్య చెప్పటం పూర్తి అయినాక నా పని ఒకటి చేసి పెట్టవలసి ఉంటుంది," అన్నాడు.

ఎవరూ మాట్లాడలేదు. అర్జునుడు మాత్రం, "గురుదేవా, మీరేం చెప్పినా చేస్తాను," అన్నాడు.

ద్రోణుడికి చాలా ఆనందమయింది. ఆయన అర్జునుణ్ణి కౌగిలించుకుని, చాలా సార్లు ముద్దాడాడు.

ద్రోణుడి దగ్గిర ధృతరాష్ట్రుడి కొడుకులూ, పాండురాజు కొడుకులూ మాత్రమే గాక, హస్తినాపురానికి వచ్చి ఉన్న యాదవ కుమారులు కూడా శిష్యులుగా చేరి విలువిద్య నేర్చుకున్నారు.

సూతుడి ఇంట పెరిగిన కర్ణుడు కూడా ద్రోణ శిష్యుడయ్యాడు.

అప్పటి నుంచి కూడా కర్ణుడికి దుర్యోధనుడంటే అభిమానం; అవకాశం దొరికినప్పుడల్లా పాండవులను హేళన చేసేవాడు, అవమానించేవాడు.

ద్రోణుడు చెప్పిన విధంగా అస్త్రప్రయోగాలను సామర్థ్యంతో చేస్తూ వచ్చినవాడు ఒక్క అర్జునుడే.

అందుచేత ద్రోణుడు, అర్జునుడు తనంతవాడు కాగలడని అనుకుంటూ ఉండేవాడు.

ద్రోణుడు అప్పుడప్పుడు ఒక పని చేసేవాడు. శిష్యులందరికీ చెంబులిచ్చి నీరు తెమ్మనేవాడు; తన కొడుకైన అశ్వత్థామకు



పెద్ద మూతిగల చెంబు ఇచ్చి, మిగిలిన శిష్యులందరికీ చిన్న మూతిగల చెంబులిచ్చే వాడు; నీళ్ళతో ముందు వచ్చిన వారికి ప్రత్యేకమైన అనేక అస్త్ర రహస్యాలు చెబు తూండేవాడు.

పెద్ద మూతిగల చెంబు తీసుకున్న అశ్వ త్థామ తన చెంబును శీఘ్రంగా నించుకుని ముందు వచ్చేవాడు. అర్జునుడు ఈ సంగతి గ్రహించి, తన చెంబు మూతి చిన్నదైనా, వారుణాస్త్ర ప్రభావంతో దాన్ని శీఘ్రంగా నించుకుని, అశ్వత్థామతో పాటే ద్రోణుడి దగ్గరికి తిరిగి వచ్చి, అశ్వత్థామ నేర్చుకున్న రహస్య అస్త్ర విద్యలన్నీ తాను కూడా నేర్చు కునేవాడు.

ఈ కారణంగా అశ్వత్థామకు అర్జునుడంటే మనసులో బయటకు చెప్పరానంత అసూయ ఉండేది.

ద్రోణుడి ఇంట ఒక రాత్రి శిష్యులంతా కూర్చుని భోజనం చేస్తూండగా ఉన్నట్టుండి బలంగా గాలికొట్టి దీపం ఆరిపోయింది. అందువల్ల భోజనం చెయ్యటానికేమీ ఇబ్బంది కలగకపోవటం గ్రహించి, అర్జునుడు, "అభ్యా సంవల్ల గదా చీకటిలో కూడా అన్నం తిన గలుగుతున్నాను. మరి చీకటిలోనే విలు విద్య ఎందుకు అభ్యసించగూడదు?" అను కుని, ఆ రోజు నుంచి అలా చెయ్యనారంభిం చాడు.

ఒక రాత్రి ద్రోణుడికి ధనుష్టంకారం విని నిద్రాభంగమయింది. ఆయన లేచి వచ్చి, అర్జునుడు చీకట్లో విలువిద్యాభ్యాసం చేస్తూ ఉండటం గమనించి, పరమానం దంతో కౌగిలించుకుని, "నాయనా, నీతో సమానమైన విలుకాడు మరొకడు లేడని పించేలాగా నిన్ను తయారు చేస్తాను," అన్నాడు.

అన్న విధంగానే ఆయన అర్జునుడికి దొమ్మి యుద్ధం ఎలా చేయాలో, రథాల మధ్యా, ఏనుగుల మధ్యా, గుర్రాల మధ్యా, నేలపై నిలబడీ ఎలా యుద్ధం చెయ్యాలో; బాణాలతోనే కాకుండా గదలూ, మొదలైన వాటితో యుద్ధం ఎలా చెయ్యాలో, వాటిలోని రహస్యాలన్నిటితో సహా నేర్పాడు.





# పారిన పథకం

గౌరీపురంలో వుండే సూరమ్మకు గయ్యాళి తనమూ, ధనాశా ఒక పాలు ఎక్కువగానూ, పొదుపరితనమూ, సంపాదించగలిగే నేర్పూ ఒక పాలు తక్కువగానూ వుండేవి. ఆమెకు ఇద్దరు పిల్లలు. వాళ్ళు చిన్నవాళ్ళుగా వుండగానే భర్త పోగా, ఉన్న ఆస్తినేదో కర్పూరంలా కరిగిస్తూ వాళ్ళను పెంచుకొచ్చింది. ఈమధ్యనే కూతురి లక్ష్మికి పెళ్ళి చేసింది. ఇక పెళ్ళికి మిగిలినవాడు కొడుకు గోపాలుడు.

గోపాలుడు బాగా చదువుకుని కచ్చేరీలో మంచి ఉద్యోగం చేస్తున్నాడు. ఆ ఉద్యోగాన్ని ఎరగా చూపి, ఆడపెళ్ళి వారి నుంచి పెద్దగా కట్న కానుకలు లాగి, తన పూర్వవైభవాన్ని తిరిగి పొందాలని ఆమె వచ్చిన ప్రతి సంబంధాన్నీ, వారి ఆస్తిపాస్తులు తూకం వేసి తిరగ్గొట్టడం ప్రారంభించింది.

తల్లి సంగతి ఇలా వుండగా, గోపాలుడి ఆశలూ, కోరికలూ అందుకు భిన్నంగా వున్నవి. తాముంటున్న వీధిలోనే, నాలుగిళ్ళ అవతల వున్న తమ బంధువుల పిల్ల నిర్మలను వివాహమాడాలన్నది అతడి ఆలోచన. నిర్మల చురుకుదనమూ, సహనమూ గల పిల్ల. అయితే, తనకు నిర్మలతో సవ్య మార్గాన వివాహం జరుగుతుందన్న ఆశ మాత్రం అతడికి లేదు. అందుకు, నిర్మల కుటుంబం ఆర్థికంగా తమ కంటే తక్కువ స్థితిలో వుండడం ఒక కారణమైతే, నిర్మల తండ్రి రామయ్యకూ, తన తల్లికీ మధ్య ఏవో కుటుంబాల పాత తగవుల కారణంగా నివురు కప్పిన నిప్పులాంటి శత్రుత్వం వుండడం మరొక కారణం.

ఈ పరిస్థితుల్లో ఏం చెయ్యాలా అని గోపాలుడు చాలాకాలం మధనపడి, చివరకు ఒకసారి నిర్మలను ఏకాంతంగా కలుసుకుని, తను కోరుకుంటున్నదేమిటో వివరంగా చెప్పి, "మనిషి ఎటువంటిదైనా, ఆమె నా కన్న తల్లి! ఆమెలో మార్పు కోరుకోవడమే గాని

లలిత–శర్మిల



ఏమీ చెయ్యలేని అసహాయ పరిస్థితి నాది. అటు అమ్మను కష్టపెట్టకుండా నేను సుఖ జీవితం గడపాలంటే, నీవంటిదాని సహకారం అవసరం. నీకు కూడా నేనంటే ఇష్టమైన పక్షంలో, మన పెళ్ళికి ఏదో ఒక ఉపాయం నువ్వే ఆలోచించు," అన్నాడు.

తల్లిలాగా కాకుండా మంచివాడూ, నెమ్మదస్థుడూ అయిన గోపాలుడంటే నిర్మలకు కూడా ఇష్టమే. ఆ ఇష్టాన్ని సూచిస్తూ, సిగ్గుతో తలవంచుకుని కొద్దిసేపు మౌనంగా వూరుకున్న నిర్మల, చివరకు, "ఉపాయానికేం, ఆలోచించవచ్చుగాని, ఎటుతిరిగీ అత్తయ్యను కాస్త అయినా కష్టపెట్టక తప్పదు," అన్నది.

దీనికి గోపాలుడు నవ్వి, "ఉన్నది మొండి జబ్బని తెలిశాక, దాన్ని పూర్తిగా తీపి మందులతోనే తగ్గించమని పట్టుబట్టే మూర్ఖుణ్ణి కాదు, నిర్మలా!" అన్నాడు.

గోపాలుడికి తనమీద వున్న అభిమానానికీ, నమ్మకానికీ కృతజ్ఞతగా చూసిన నిర్మల, "అయితే సరే! సాధ్యమైనంత త్వరలో ఏదో ఒక ఉపాయం ఆలోచించి, నీకు చెబుతాను," అన్నది.

ఆ తర్వాత రెండు మూడు రోజుల్లోనే తండ్రి సహకారంతో నిర్మల ఒక పథకం రూపొందించడమూ, గోపాలుడు దానికి అంగీకరించడమూ జరిగాయి.

ఆరోజు నుంచి వారం గడవకుండా, ఒక విచిత్రం జరిగింది.

ఒకనాటి తెల్లవారు ఝామున, ఇంటి ముంగిట కళ్ళాపి చల్లడానికి నిర్మల వచ్చేసరికి, వాకిట్లో ఒక వృద్ధ సాధువు సొమ్మసిల్లి పడిపోయి కనిపించాడు. నిర్మల చప్పున తండ్రిని పిలిచి, సాధువును లోపలకు చేర్చి ఉపచారాలు చేసింది.

కొద్దిసేపట్లోనే తేరుకున్న సాధువు, మరి రెండు రోజుల్లో బాగా కోలుకున్నాడు. క్రమంగా అతణ్ణి గురించిన వివరాలు తెలియవచ్చాయి.

సాధువు పేరు కరుణానందుడు. అతడి వయసు నూట ఇరవై సంవత్సరాలు. గత నూట పది సంవత్సరాలుగా హిమాలయ

పర్వత సానువుల్లో ఏకాంత జీవనం సాగిస్తూ, అనేక మహిమలు గడించాడు. మరొక రెండు సంవత్సరాల్లో నిర్వాణం చెందను న్నాడు. గురువు ఆదేశానుసారం, తాను నిర్వాణం చెందేలోగా, జనావాసాలన్నీ కాలి నడకన తిరిగి, తన మహిమలన్నీ మంచి వాళ్ళకూ, కరుణాహృదయులకూ ధారపోస్తు న్నాడు. అలా తిరుగుతూనే ప్రయాణభారం, వృద్ధాప్యం వల్ల నిర్మల ఇంటి ముంగిట్లో సొమ్మసిల్లి పడిపోయాడు.



ఈ వివరాలన్నీ ఇరవై నాలుగు గంటల్లో ఊరంతా తెలిసిపోయాయి. ఊరి వాళ్ళలో కొందరు పూలూ, పళ్ళూ తీసుకువెళ్ళి కరుణానందుడి దర్శనం చేసుకురాసాగారు. ఒకరిద్దరు మంచివాళ్ళకు మాత్రం, ఆయ నతో సన్నిహితంగా మాట్లాడే అవకాశం లభిం చింది. అటువంటి వారిలో సూరమ్మ ఇంటి కెదురుగా వుంటున్న గంగాధరం ఒకడు. గంగాధరాన్ని కరుణించిన సాధువు, అత డికి ఏదో మహిమ కూడా ప్రసాదిస్తానని చెప్పాడు.

ఈ సంగతంతా సూరమ్మకు తెలిసింది. మొదట రామయ్య ఇంటికి వెళ్ళడానికి సందేహించిన సూరమ్మ, చివరికి ఒకసారి వెళ్ళి సాధువు దర్శనం చేసుకుని, అతడిని తన ఇంటికి ఆహ్వానించి సేవలు చేసి, ఏదైనా మహిమలు సంపాదించాలనే నిర్ణ యానికి వచ్చింది.

తీరా అనుకున్న రోజున సూరమ్మ వెళ్ళే సరికి సాధువు దర్శనం వెంటనే దొరకలేదు. అతడు లోపల దీక్షలో కూర్చుని, నిర్మలకు ఏదో మంత్రాన్ని ఉపదేశిస్తున్నాడు! ఆమె తండ్రి రామయ్య మాటల వల్ల, సూరమ్మకు తెలిసినదేమంటే — సాధువు, నిర్మలకు మహా లక్ష్మీ మంత్రం ఉపదేశిస్తున్నాడు. సంవత్స రానికి ఒకసారి వచ్చే మూలా నక్షత్ర యుక్త పౌర్ణమీ శుక్రవారం నాడు, ఆ మంత్రాన్ని ఎని మిది సార్లు జపిస్తే, ఇంట్లోని ప్రతి మూలలోనూ నూట ఎనిమిది చొప్పున బంగారు నాణాలు ప్రత్యక్షమవుతాయి!

ఇది వింటూనే సూరమ్మకు, నిర్మలను తన కోడలుగా చేసుకోవాలన్న ఆశ కలిగింది.



వస్తాను," అన్నాడు. సూరమ్మ, సాధువుకు వినయంగా నమస్కరించి, "మీ ఇష్టం. స్వామీ! కాకపోతే మరొక చిన్న కోరిక," అన్నది.

"ఏమిటో చెప్పు!" అన్నాడు సాధువు.

"మీ అభిమానానికి పాత్రురాలైన నిర్మల అంటే, నాకు దాని చిన్నతనం నుంచీ అభిమానం, స్వామీ! ఎంతోకాలంగా దాన్ని నా కోడలిని చేసుకోవాలనుకుంటున్నాను. కానీ దాని తండ్రికి నేనంటే పిసరంత గౌరవం కూడా లేదు," అన్నది సూరమ్మ.

సూరమ్మ మాటలు వింటూనే సాధువు కరుణానందుడు కళ్ళు మూసుకుని, కొద్ది సేపు తర్వాత తెరిచి, "నీకున్న ఒక్కగా నొక్క కొడుకు గోపాలుడు! వాడు కచ్చేరీ ఉద్యోగం చేస్తున్నాడు, అవునా?" అని ప్రశ్నించాడు.

"అవును, స్వామీ!" అంటూ సూరమ్మ ఆనందంగా జవాబిచ్చింది.

సాధువు బయట ఎవరితోనో మాట్లాడుతున్న రామయ్యను పిలిపించి, "రామయ్యా! ఈ సూరమ్మ కొడుకు చాలా ఉత్తముడు. నీ కూతురు నిర్మలకు తగినవాడు," అన్నాడు.

రామయ్య చేతులు జోడిస్తూ, "తమ ఆజ్ఞ, స్వామీ," అన్నాడు.

ఆ తర్వాత నెల తిరక్కుండానే రామయ్య, నిర్మలకూ, గోపాలుడికీ వివాహం జరిపించాడు. వివాహం అయిన వెంటనే కాపురానికి

ఇంతలో లోపలి తతంగం అంతా ముగిసినట్టు తెలియవచ్చింది. సూరమ్మ లోపలికి పోయి, సాధువుకు సాష్టాంగ ప్రణామం చేసి, అతణ్ణి తన ఇంటికి రావలసిందిగా ప్రార్థించింది.

సాధువు మందహాసం చేస్తూ, "ఇప్పుడు వీలు కాదు, తల్లీ! ఏ చోటా వారం రోజులకు మించి వుండరాదని గురువాజ్ఞ. మరొక ఆరు నెలల్లో — అంటే రాబోయే శ్రావణ మాసంలో నిర్మల తొలిసారిగా మహాలక్ష్మీ మంత్రం జపించబోతున్నది. ఉపదేశించిన గురువుగా నన్ను, ఆరోజున ఇక్కడికి వచ్చి, నా ఆధ్వర్యంలో పూజ జరిపించమని పట్టుబడుతున్నది. అప్పుడు నీ ఇంటికి కూడా

వచ్చిన నిర్మల కూలీల చేత పాడుపడినట్టున్న పెద్ద పెరడును బాగు చేయించి, రకరకాల కూరగాయ మొక్కలు నాటించింది. ఆ పెరట్లోనే ఒక మూలగా పాకవేయించి, అందులో రెండు గేదెల్ని కొనితెచ్చిపెట్టి పాల వ్యాపారం ప్రారంభించింది.



ఈవిధంగా నాలుగునెలలు గడిచేసరికి, కూరగాయలూ, పాలూ అమ్మగా వచ్చిన లాభాలతో, సూరమ్మ అక్కడా ఇక్కడా చేసిన అప్పులు తీర్చి కొంత డబ్బు వెనుక వేసింది.

తన కోడలు ఏ మంత్రం జపించకుండానే డబ్బు సంపాయిస్తున్నదని సూరమ్మ సంతోషించినా, రాబోయే శ్రావణమాసంలో మహాలక్ష్మి మంత్రం జపించి, ఆమె కూడ బెట్టబోయే బంగారు నాణాల కోసం ఆత్రతగా ఎదురుచూడసాగింది.

కొన్నాళ్ళకు శ్రావణమాసం వచ్చింది. ఒకనాటి ఉదయాన రామయ్య, గంగాధరం వెంటరాగా సాధువు కరుణానందుడు వచ్చాడు. తనను చూడగానే పొంగిపోతూ అతిథి మర్యాదలకు పూనుకున్న సూరమ్మతో సాధువు, "ఏం, సూరమ్మా! ఇల్లు కళకళలాడుతున్నది. నీ కోడలు మంత్రం జపించకుండానే, నీ ఇంటికి మహాలక్ష్మి వచ్చిందన్నమాట!" అంటూ తను పెట్టుకున్న నకిలీ గడ్డమూ, జడలూ తీసి పక్కన పెట్టాడు.

సూరమ్మ నిర్ఘాంతపోతూ చూసి, "ఏమిటీ మోసం?" అంటూ కోపంగా మరేదో అనబోయింది. కాని, కరుణానందుడిగా వేషం వేసుకు వచ్చిన వృద్ధుడు, ఆమెను వారిస్తూ, "నన్ను నానా మాటలూ అనబోయే ముందు, నే నెవరో గుర్తుపట్టగలవేమో ఒకసారి పరీక్షగా చూడు, సూరమ్మా!" అన్నాడు.

ఆ మాటకు అతణ్ణి పరీక్షగా చూసిన సూరమ్మ, అతణ్ణి గుర్తుపట్టి, తడబడుతూ, "మీరా!" అంటూ తల వంచుకున్నది.

అప్పుడు వృద్ధుడు శాంతంగా, "గుర్తుపట్టావు గదా!" అని, అక్కడే వున్న గోపాలుడికేసి తిరిగి, "నాయనా! నేను మీ నాన్నకు స్వయానా పినతండ్రిని. మీ అమ్మకు పిన మామగారిని. నాకు అప్పట్లో ఊళ్ళు తిరిగి నాటకాలు వేసే అలవాటుండేది. అది

మా అన్నయ్యకు అంటే మీ తాతకు ఇష్టం వుండేది కాదు. నా అభిరుచిని వదులుకోలేక, నేను మరొక ఊరు వెళ్ళిపోయాను. వృద్ధులైన అత్త మామల్ని, మీ అమ్మ నానా బాధలూ పెట్టి కట్టుబట్టలతో వీధిలోకి తరిమేసింది. ఆ తర్వాత వాళ్ళ జీవితం కడదాకా నా దగ్గర సుఖంగా గడిచినా, వాళ్ళు మాత్రం చివరి క్షణం వరకూ కొడుకు కోసం బాధపడుతూనే వున్నారు," అంటూ ఆగి సూరమ్మను, "ఏం తల్లీ! నేను చెప్పిన దాంట్లో అబద్ధం పాలు ఏమీ లేదుగదా?" అని ప్రశ్నించాడు.

సూరమ్మ వెలవెలపోతూ, తల పక్కకు తిప్పుకున్నది. వృద్ధుడు ఒక్క క్షణం ఆగి, గోపాలుడితో, "ఇదంతా ఈ రామయ్యకూ, గంగాధరానికీ తెలుసు. నువ్వు నిర్మలను చేసుకోవడానికి నిశ్చయించుకున్న తర్వాత, నిర్మల రూపొందించిన పథకంలో, సాధువు పాత్రకు రామయ్యా, గంగాధరం నన్ను ఒప్పించారు. ఆపైన జరిగినదంతా నీకు తెలిసిందే! ఇక మీ అమ్మకు చెప్పవలసిందే మిగిలింది," అంటూ సూరమ్మ వైపు తిరిగి, "అత్త మామలను కాల్చుకుతిన్న నీ వంటి దానికి, నిర్మలలాంటి కోడల్ని తీసుకు వచ్చి, నీ కొడుకు నిన్ను చాలా అదృష్టవంతురాలిని చేశాడు. నిర్మల గుణ గణాలు నీకు తెలియడం కోసమే, ఈ ఆరు నెలల గడువూ ఇచ్చాను. ఇప్పటికైనా అర్థం చేసుకుని సవ్యంగా ప్రవర్తించావా సరే సరి, లేదా నిర్మల కూడా ఒకనాటి సూరమ్మలా ప్రవర్తిస్తుంది!" అన్నాడు.

ఆసరికి పరిస్థితి అంతా పూర్తిగా అర్థం చేసుకున్న సూరమ్మ బొటా బొటా కన్నీళ్ళు కారుస్తూ, "మామయ్యా! నాతప్పు నాకు తెలిసింది. మీరు చెప్పినట్టు నిర్మల నా కోడలవటం నిజంగా నా అదృష్టం. ఈ ఆరు నెలల్లోనే మా ఇంటి పరిస్థితులు పూర్తిగా మార్చేసిన నా కోడలు, అన్నివిధాలా ఈ ఇంటి మహాలక్ష్మి!" అన్నది.

సూరమ్మలో వచ్చిన మంచి మార్పుకు, సాధువు వేషంలో వున్న ఆమె పినమామతో పాటు అక్కడ ఉన్నవారందరూ చాలా సంతోషించారు.







# అహంకారం

చాలాకాలం కిందట కుముదుడనే మహర్షి విష్ణువునుగూర్చి ఘోరతపస్సు చేశాడు. కొంత కాలానికి విష్ణువు లక్ష్మీసమేతుడై ఆయనకు ప్రత్యక్షమయ్యాడు. సాష్టాంగ నమస్కారం చేసి, చేతులు జోడించి నిలబడిన కుముదుడిని ఏమి వరం కావాలో కోరుకోమన్నాడు మహా విష్ణువు.

ఏ కోరికలూ లేకుండా, కేవలం విష్ణు దర్శనం కోసమే కుముదుడు తపస్సు ప్రారంభించాడు. అలాంటి స్థితిలో విష్ణువు వరం కోరుకోమనేసరికి అతడు తికమకపడ్డాడు.

లక్ష్మీదేవి కుముదుడి మనస్థితిని గ్రహించినదై, "వత్సా, నీ భక్తికి మెచ్చాము. అనాలోచితంగా ఇప్పుడే ఏదో వరము కోరుకోనవసరం లేదు. మేము మళ్ళీ మాసం రోజుల్లో నీకు దర్శనం ఇస్తాము. ఈ గడువులో బాగా ఆలోచించి నీకు కావలసిన వరం ఏదో కోరుకోవచ్చు!" అన్నది.

లక్ష్మీదేవి మాటలతో కుముదుడు స్థిరచిత్తుడయ్యాడు. మరుక్షణంలోనే మహావిష్ణువు లక్ష్మీసమేతంగా అదృశ్యుడయ్యాడు.

కుముదుడు తన తపస్సు ఫలించిందిగదా అని మహదానందం పొందాడు. తరవాత తన ఆశ్రమానికి తిరిగివచ్చి శిష్యులకు ఈ శుభవార్త తెలిపాడు.

గురువుగారి అమోఘ తపశ్శక్తికి శిష్యులంతా అబ్బురపడ్డారు. సాక్షాత్తు ఆ మహావిష్ణువే ప్రత్యక్షమై వరం కోరుకోమన్నా కోరుకోని ఆయన త్యాగాన్ని వేనోళ్ళ ప్రస్తుతించారు. ఈ పదునాలుగు భువనాల్లో ఇంత సర్వసంగ పరిత్యాగి, మహాభక్తుడు లేడని పొగడసాగారు. ఈ పొగడ్తలతో కుముదుడిలో అహంకారం ఏర్పడింది. తనకంటే మహర్షిశ్రేష్ఠుడు ఎక్కడా లేడని భావించసాగాడు.

ఈ స్థితిలో కుముదుడు ఒకనాడు గంగా నదికి శిష్యులతో కలిసి స్నానానికి వెళ్ళాడు.

అక్కడ వీరికి నదిలో స్నానం చేసి వస్తూన్న రైవతుడు అనేరాజర్షి ఎదురయ్యాడు. భార్యా, పదిమంది పిల్లలూ, ఈయనేమి ఋషి అన్న సంశయం కలిగింది కుముదుడి శిష్యులకు. సంశయ నివృత్తికై వాళ్ళు గురువును ప్రశ్నించారు. అందుకు కుముదుడు, "ఈ రైవతుడు ఋషినామానికి ఎలా అర్హుడో నాకు తెలియటంలేదు. సర్వసంగ పరిత్యాగం చేసి, ఆకు అలములు తింటూ అడవుల్లో తపస్సు చేసే వాళ్ళకే దైవదర్శనం దుర్లభం కదా?" అన్నాడు ఈసడింపుగా.

అలా అన్నాడే కాని కుముదుడికి తన సమాధానంతనకేసంతృప్తికరంగాలేదు. సరే విష్ణుమూర్తి ఇక కొద్దిదినాలలో ప్రత్యక్షమవుతాడుగదా ఆయననే అడిగి సంశయ నివారణ చేసుకుందాంఅనుకున్నాడాయన. నెలరోజులు జరిగిపోయేసరికి విష్ణుమూర్తి లక్ష్మీసమేతుడై తిరుగా కుముదుడికి ప్రత్యక్షమయ్యాడు. అప్పుడు వరాలు కోరే సంగతి మరిచిపోయిన కుముదుడు, రైవత రాజర్షిని గురించిన తన సంశయం తీర్చవలసిందిగా అడిగాడు.

అందుకు మహావిష్ణువు నవ్వి, "కుముదా! నాకు భక్తి ప్రధానం. మనస్సు నిర్మలం కానప్పుడు సన్యాసం స్వీకరిస్తే మాత్రం ఏముంది? అయినా, నీకు పూర్తిగా సంశయనివృత్తి కావాలంటే శ్రీశైలందగ్గిర వున్న స్వర్ణాగ్రహారానికి వెళ్ళు. అక్కడ సుధర్ముడు అనే ఆయన ద్వారా నీకు సంశయ నివృత్తి కలుగుతుంది," అని చెప్పి అంతర్థానమయ్యాడు.



తరవాత కుముదుడు తనశిష్యబృందంతో శ్రీశైలానికి బయలుదేరికొన్నిరోజుల ప్రయాణా నంతరంఅక్కడికి చేరాడు.ఒకనాటి ఉదయం శిష్యులు వెంటరాగా పాతాళగంగలో స్నానానికి వెళ్ళాడు.అందరూస్నానాలుచేస్తున్నంతలోఒక మొసలి వచ్చి కుముదుడి కాలు పట్టుకున్నది.

గురువుగారినిమొసలిపట్టుకోవటంచూసిన శిష్యులు భయకంపితులై కేకలు వేయసాగారు. కాని కుముదుడు నిర్భయంగా దానికేసి తీవ్ర దృక్కులతో చూశాడు. అతని తపోశక్తివల్ల మరుక్షణమే మొసలి గిలగిల కొట్టుకుని ప్రాణాలు విడిచింది. ఈ సంఘటనతో కుము దుడిలోనిఅహంకారంమరికాస్త వృద్ధిఅయింది.

ఒకటి రెండు రోజుల తరవాత కుముదుడు స్వర్ణాగ్రహారానికి వెళ్ళాడు. తీరా ఆయన అక్క డికి వెళ్ళేసరికి సుధర్ముడు ఇంటలేడు. సుధ ర్ముడి భార్య ఆ సమయంలో తలుపు పక్కనే కూర్చుని ఒక పాత చీర చిరుగులు కుట్టు కుంటోంది. కుముదుడిని చూసి, భర్త వచ్చే వరకు బయట అరుగు మీద కూర్చోవలసిం దిగా చెప్పింది.

తనవంటి గొప్ప ఋషికి తగిన మర్యాద జరగలేదని కుముదుడికి చాలా కోపం వచ్చింది. తలుపు చాటున కూర్చుని వున్న సుధర్ముడి భార్యకేసి తీవ్రదృక్కులతోచూశాడు. కాని మొసలిలాగా ఆమె గిలగిల తన్నుకుని కిందపడిపోలేదు.

దీనితో కుముదుడికి తన తపోశక్తి మీద కొంత అపనమ్మకం ఏర్పడింది. అంతలో సుధర్ముడు అక్కడికి వచ్చి — అతిథుల నంద



రినీ గృహంలోకి ఆహ్వానించాడు.కాసేపటికల్లా వంట సిద్ధంచేసి అందరికీ భోజనం వడ్డించింది సుధర్ముడి భార్య.

కుముదుడు విస్తరిముందు కూర్చున్నాడు. వంటకాలు ఏకారణం చేతనో చాలా చల్లగా వున్నాయి. కుముదుడికి చాలా కోపం వచ్చింది. అతను హేళనగా, "సుధర్మా! వంటకాలన్నీ తగని వేడిమిగా ఉన్నాయి!" అన్నాడు.

సుధర్ముడు, కుముదుడి హేళనను గ్రహించాడు, "స్వామీ, అయితే ఈ విసనకర్రతో విసురుతాను!" అంటూ చేతనున్న విసనకర్రతో విసరసాగాడు.

నిమిషంలో కుముదుడి విస్తటిలోని పదార్థాలన్నీ వేడెక్కి పొగలు విడవసాగినై. కుముదుడు ఆశ్చర్యపోయాడు.

భోజనం ముగించి, చేయి కడుగుకునేందుకు బావి దగ్గరకు వెళ్తే అక్కడ మరొక వింత దృశ్యం కుముదుడిని కలవరపెట్టింది. బావి గిలకమీద సగం లాగి వదిలిన చేంతాడూ, బావిలో వేలాడుతూవున్న నిండు బొక్కెనా అతడి కంటబడినై.

"నీళ్ళు చేదుతూ చేదుతూ వుండగా, మావారు పిలిస్తే చేద అక్కడే వదిలి వెళ్ళాను," అని అక్కడికి వచ్చిన సుధర్ముడి భార్య నవ్వుతూ కుముదుడితో చెప్పింది.

తనకంటే గొప్ప తపశ్శాలి లేడనీ, సంసార కూపంలో పడివున్న వాళ్ళు అల్పులనీ భావించే కుముదుడికి గర్వభంగమయింది.

అతడు చేతులు జోడించి సుధర్ముడికి నమస్కరిస్తూ, "సుధర్మా, మీరు మహనీయులు! సర్వసంగపరిత్యాగులై తపస్సు చేయనివారికూడా మోక్షం వుంటుందా?" అని అడిగాడు.

అందుకు సుధర్ముడు, "నిర్మలమైన మనస్సుతో దేవుడిని ఎక్కడ వుండి ప్రార్థించినా ముక్తి లభ్యమవుతుంది. అడవులలో కందమూలాలు తింటూ, ముక్కు మూసుకు కూర్చున్నా — నిర్మలమైన మనస్సులేని అహంకారికి మోక్షద్వారం తెరవబడదు!" అనిచెప్పాడు.

ఈ విధంగా కుముదుడికి సంశయనివృత్తి కలగటమేగాక, అహంకారం కూడా నశించింది. ఆనాటి నుంచి నిర్మల చిత్తంతో భగవధ్యానం చేసి ముక్తిపొందాడు.



# ప్రకృతి వింతలు

## గ్రహణ శక్తి

ర్యాటిల్‌స్నేక్ అనే పాము మామూలుగా రాత్రులలో ఆహార అన్వేషణకు బయలుదేరుతుంది. ఆ పాము కంటికీ ముక్కుకూ మధ్యవున్న చిన్న పల్లం ద్వారా వేడిని సులభంగా గ్రహిస్తుంది. అలా వెచ్చదనాన్ని స్పష్టంగా పసిగట్టడం వల్ల ఆహారాన్ని పట్టుకోవడానికి అది ఎంతయినా ఉపయోగపడుతుంది.





## అతి పెద్ద అడవిపిల్లి

దక్షిణ అమెరికా అడవులలో కనిపించే జాగువార్‌లు అమెరికా అడవిపిల్లులన్నిటిలోకీ చాలా పెద్దవి. వీటి బరువు దాదాపు 300 పౌండ్లు ఉంటాయి. అంటే, ఇది చిరుత పులికన్నా ఎక్కువ బరువు. శరీరం మీది పసుపు పచ్చ చర్మం మీద గుండ్రంగా నల్లటి మచ్చలుంటాయి!

## మొట్టమొదట ఎగిరిన కీటకాలు!

తూనీగలు భూమి మీద దాదాపు 300, 000, 000 సంవత్సరాలకు పూర్వం పుట్టుకొచ్చాయని విశ్వసిస్తున్నారు. ఎగరడానికి నేర్చిన మొట్టమొదటి కీటకాలు కూడా తూనీగలే అని భావిస్తున్నారు. కొన్ని తూనీగలకు 70 సెం.మీ. పొడవు రెక్కలు ఉంటాయి.



Say "Hello" to text books and friends
'Cause School days are here again
Have a great year and all the best
From Wobbit, Coon and the rest!



# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1995 ఫిబ్రవరి నెల సంచికలో ప్రకటింపబడును.


S.G. Seshagiri


Devidas Kasbekar

*పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) *డిసెంబర్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. *మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. *వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026.

## అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : అనుభవం లేని, సిస్టర్! రెండవ ఫోటో : అర్జంటుగా రండి, డాక్టర్!!

పంపినవారు : కోరాడ నరసింహారావు యాదవ్, భవానీ ఫోటో స్టూడియో, స్టేట్ బ్యాంక్ పక్కన

పార్వతీపురం – 532 501 (ఆం.ప్ర)

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.




**Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.**